

# శశాంక

గుడిపాటి వెంకటచలం

ప్రకటనకర్తలు :

నమ్మాళ్వార్స్,

పోస్టు బాక్సు 251,

మద్రాసు.



[వెల ఆరు అణాలు.

నవ్యాళ్వార్స్
పోస్టుబాక్సు 251, మద్రాసు.

(1) ప్రతినెల మొదటి తేది నాటికి రెండు చొప్పున గాని, రెండు నెలలకొకసారి నాల్గు గాని, ప్రస్తుతము భారత దేశమును కలవర పెట్టుచున్న రాజకీయములు, ఆర్థిక వాణిజ్యసంబంధములు, శాస్త్రసంబంధములు, కథలు, కావ్యము

నగు గ్రంథములు ప్రకటింపబడును.

(2) తమ తమ గ్రంథముల నచ్చొత్తించుటకు గ్రంథకర్తలకు కావలసిన సహాయములన్నియు చేయబడును. సలహా లీయబడును.

(3) ఇతరుల గ్రంథముల విక్రయించుటకు ఏర్పాట్లు చేయబడును.

(4) గ్రంథకర్తలు, ప్రకటనకర్తలు, విక్రయదారులు వివరములకు వ్రాయవలెను.

1. కీనా జనన్ము ప్రశ్నము: సామ్రాజ్యతత్త్వ నిరూపణము - గాడిచెర్ల హరిసర్వోత్తమ రావు గారు.

2. భారత రాజ్యాంగము :- కాంగ్రెసు ప్రభుత్వం.

పత్రిక, మద్రాసు.

3. తిలోత్తమ : చారిత్రక మగు నవల. పులవర్తి కమలావతీదేవి గారు.

4. ఆంధ్ర కథావళి:-ప్రథమ సంపుటము.

ఇట్లు,
జమిలి నవ్యాళ్వారు,
వ్యవస్థాపకుడు.

# శశాంక

(నాటకమ్)

శ్రీ గుడిపాటి వెంకటచలంగారు

గ్రంథకర్త.

[ప్రథమ ముద్రణము 2000 ప్రతులు]

ప్రకటనకర్తలు:

నమ్మాళ్వార్స

పోస్టుబాక్సు నెం 251,

మద్రాస్.

 1937 [వెల 6 అణాలు.

# శశాంక

[ఈ నాటకంలో కొత్తపాత్ర అనూరాధ. ఈమెనే శశాంకుడు 'అనూ' అనీ తక్కినవాళ్లు 'గాధ' అనీ పిలుస్తారు.]

## అంకం ౧

మంగళవారం. శుద్ధఏకాదశి. రాత్రి పదిగంటలు. సన్నని వెన్నెల. బృహస్పతి ఆశ్రమం వెనకాల తమాలవృక్షంక్రింద అలికిన అరుగు. చెట్ల వెనకనించి అనూరాధపాట వినబడుతోంది.

తారా, బృహస్పతీ మాట్లాడుకుంటో వొచ్చి, పాట వింటో నుంచుని అరుగుమీద కూచున్నారు.

బృహస్పతికి ముప్పైయేళ్లు దాటాయి. శ్రోత్రియబ్రాహ్మణుడు. ముఖాన బ్రహ్మవర్చస్సు. తార రూపవతి. బలువైన రెప్పలకింద కళ్లు సగం మూతలుపడి, కిందికి చూస్తోవుంటాయి.

తార.

యీ అర్ధరాత్రిదాకా అతన్ని యిట్లా తనవెంట తిప్పుకుంటుంది. ఆపాటలు విన్నారా? పదహారేళ్లు లేవు! యేమి టా విరహాలు, ఆ తాపాలు, ఆభావాలు! (ఆగి) పిచ్చివాణ్ణి చేసి నాశశిని లాలించి మరిపించి బలవంతంగా అతని మనసుని తనవేపు తిప్పుకుని......దాన్ని చూస్తే నాకెంత ఆగ్రహం కలుగుతుందని! కుటిలత్వం దాని నొసటిమీద వేళ్లాడుతో వుంటుంది.

బృహస్పతి.

తారేనా! పరమసాధ్వి, తారేనా మాట్లాడు తోంది!

తార.

క్షమించండి. కాని అనూరాధని తలుచుకున్న మాత్రాన నా మనసూ, వాక్కూ స్వాధీనం తప్పుతాయి. యెన్నడూ యెరగని యీ నూతన దురావేశాన్ని నాలో ప్రే రేపించేందుకు ఆ అనూరాధలో యేముందో గాని...నా కర్థం కాదు యీ బాధ.

బృహస్పతి.

యితరులలో కనపడే మాలిన్య మెప్పుడూ హృదయదర్పణాల ప్రతిబింబితమైన స్వకీయ కల్మషమే!

తార.

(ఆలోచనగా) శశాంకుడు నావాడు.

బృహస్పతి.

తారా! సంకుచితమైన యీ యీర్ష్యలకు అతీతులము కావాలి. (తార మాట్లాడలేదు. సిగ్గుతో తల వొంచుకుంది. మాట తప్పించ తలచుకుని) ఎన్నడూ లేని యీ కోపం కొత్తఅందాన్ని నీముఖంలో వెలిగించింది. హిమాలయ శిఖరాన సూర్యోదయ మైనట్టయింది. నే నెరుగుదును, ఇంత హృదయాగ్ని నీలో నిగూఢమై వుందని... .....(ఆలోచిస్తో) పైకి ఆ చంద్రుడంత శీతలంగా కనపడతావు గాని, అతనివలెనే లోపల కాలాగ్ని...... హృదయతాపాన్ని యిద్దరూ వెలిగిస్తారు. శాంతపరిచే దాక్షిణ్యం వొకరికీ లేదు.

శశాంక

తారా

అంటే ?—

బృహస్పతి.

చూడు. ఆ చంద్రుడికి నే నెంత కావాలో—నీకూ అంతే కావాలి. అవునా ?

తార.

మీలో లీనమైన నాకు మీరు కావా లంటే అర్థ మేమిటి ?

బృహస్పతి.

పురుషవాంఛ నెరగని నిర్మల నదీకన్యవు నువ్వు. ఎన్ని ఆలింగనాల్లోంచి, యెంత కామాగ్నినించికూడా యేమీ అంటక నిలుచుంటావు. నీహృదయశిఖరాల మీది ధవళహిమ మింతవరకు యేమోహభాను కిరణారుణిమను ఎరగదు...చలనము లేని నల్లమబ్బు కమ్మిన నడిరేయి ఆకసమువలె నిశ్చలమైన నీకళ్లలో జ్యోతే వెలిగితే, వెన్నెలసోనలు పేరుకుని కల్పించిన చలవ రాతితో చెక్కిన నీ శరీరం జీవించి కదిలి మోహన భారంతో వాలేటట్టు చెయ్యగలిగితే—

తార.

తపఃప్రపంచము వాంఛాతీతము కదూ ?

బృహస్పతి.

ప్రపంచ రసాస్వాదనమే తపస్సు.

తార.

వైరాగ్యము కదూ?

బృహస్పతి.

తుచ్ఛవిషయవాంఛా పరిత్యాగము. వ్యర్థ నిరర్థక వైరాగ్యము కాదు.

[వూరుకున్నారు. బృహస్పతి ప్రేమతో తార జుట్టుపైని చేత్తో తాకుతున్నాడు. తార శూన్యంవైపు చూస్తోంది.]

తార.

(ఆలోచనగా) మీమీద వాంఛ నాకు లేదనుకున్నారా? మీరు శిష్యులమధ్య ఆసీనులై బోధనా కుతూహలము పొంగుతూ, వారి అజ్ఞానము మీపవిత్ర వాక్కులతో కరిగిపోయ్యేట్టు వుపనిషత్సారరహస్యం బోధిస్తోవుంటే నేనూ మీశిష్యురాలనై జ్ఞానరసాస్వాదనంచేసే సౌభాగ్యము కోల్పోతినే అనేచింత నన్ను ఎప్పుడూ బాధిస్తో వుంటుంది. మీదృష్టిని అంతర్ముఖము చేసి, పరమ జ్యోతిలో లీనమైన నిమషాన నేను మీ ముఖతేజస్సులోని కిరణాన్ని ఐపోవాలని ఆశపడతాను. తిరిగి యింకో సారి, బ్రహ్మానందతేజో విరాజితమయిన మీ హృదయాకాశంలో యీక్షుద్రకీటకానికి స్థానమెక్కడదా అనే గాఢసందేహం కలుగుతుంది. మీరు నన్ను 'తారా!' అని మృదువుగా కాంక్షతో పిలిచేప్పుడు మీదాసురాలికి

నాకు ఎంత గౌరవ మిచ్చారా అని ఆశ్చర్యంవేస్తుంది. యీ మహాతపోనిధా, నా హృదయ వాటికవద్ద భిక్షం కోసం కాచివుండేది అని భయమూ, నాఅశక్తతకీ అజ్ఞానానికీ సిగ్గూ కలుగుతాయి. అసత్యమూ, కపటమూ మీ నిర్మలతేజంముందు చీలిపోతాయని గ్రహించనిదాననే అయితే నాలోలేని వుద్రేకాన్ని నటించి మిమ్మల్ని సంతుష్టిపరిచే ప్రయత్నం చేసివుందును. కాని మీరు నన్ను లాలించినప్పుడు, నన్ను ప్రజ్వలింపజేయ ప్రయత్నించినప్పుడు, మీ వున్నత స్వర్ణ పీఠంనించి పతితులైనట్టు తోస్తారు. నాభక్తి సిగ్గుతో కళ్లుమూసుకుంటుంది. నన్ను వొదిలి లక్ష్యంలేక నావంటి వారికి వేనవేలకు దుర్లభులై మహాపర్వతాగ్రాల దర్శన మివ్వాలి. ఆర్యా, మీస్థానము నాశిరస్సుపైన; పాదాలకింద కాదు.

బృహస్పతి.

నీలో వున్న అపారమైన ప్రణయపాతాళ గంగను విజృంభింపచేసి సాఫల్యాపరచుకునే శక్తి నాకు లేదు. మార్గం నాకు తెలియదు. లోపం నాది.

తార.

మీరు సర్వజ్ఞులు, సర్వకామ విద్యాపారీణులే, యేప్రకారం నేను మీప్రేమకు అర్హురాలను కాగలనో నేర్పలేరూ ?

బృహస్పతి.

ప్రేమ ఆత్మసమర్పణ మైనప్పుడే స్వీకరణార్హము...అది

గాక నేనే నీప్రేమకు అర్హుణ్ణి కానని అనుకుంటాను నిశ్చయంగా. ఎన్ని ప్రేమోపాయాలకూ, కామమంత్ర విధులకూ స్వాధీనంకాదు, నీ విచిత్ర నిగూఢస్వభావము. నిన్నావిధంగా ప్రేరేపింప ప్రయత్నించడంకూడా పాపమనిపిస్తుంది. ఏమహాచతురమూర్తో, ఏహృదయరసవిశారదుఁడో, ప్రత్యక్షమై లీలామాత్రంగా నీకళ్లల్లో ప్రణయదీప్తుల్ని వెలిగిస్తాడు కాబోలు. కాని... నేను భరించగలనా ? నేను ఆరాధించే యీలావణ్యాన్ని యేక్షుద్రుడో...

తార.

నన్ను మంత్రించండి, నాకళ్లుకప్పేసి, మాయపుచ్చి...మీ తేజస్సుని నాకళ్లముందునుంచి తొలిగించండి...లోకప్రళయకారణమైన త్రిలోచనాగ్నితో వెలిగే రుద్రుడు ప్రత్యక్షమైతే, కళ్లు మూసుకుని ఆజగద్వినాశనాట్యంలో లీనమైపోవా లనిపిస్తుంది కాని, వక్షాన చేర్చుకుని లాలించా లనిపిస్తుందా ?.....గురువులు మీరు. నా హృదయాంధకారాన్ని నిర్మూలించి మోహజ్యోతిని వెలిగించండి. (ఐదు నిమిషాలు వూరుకున్నారు.) యేమిటీ వేదన ? ఆర్యా ! నాసర్వమూ మీదిగా, మీరే నాదైవంగా, యితరమైన ఆశయము, వాంఛ, మీనుంచి వేరైన జీవనమే లేని నాలో యింకా యీ అసంతుష్టికి కారణం ఎంత వెతికినా తోచదు. యే అల్పలోపమువల్లనైనా మీకీ అసంతృప్తిని యెక్కువగా కలిగిస్తానేమో

అని భయపడి సంపూర్ణ కారుణ్యాన్ని మీనుంచి పొందాలని యెంత ప్రయత్నిస్తానని!

బృహస్పతి.

నాకు తెలుసు. నీప్రయత్నాధిక్యమే నా కత్యంత నిరాశా కారణము. అప్రయత్నమూ, నిర్వ్యాజమూ ఐన నిర్మల ప్రేమకు ప్రయత్నము విరుద్ధము కాదూ? శిశువుయెడల తన ప్రేమసేవాలోపం కనపడుతుందేమోనని భయపడు తుందా తల్లి? నువ్వు కళ్లల్లో ప్రాణంపెట్టుకుని, అతను ఆలస్యమైతే గుమ్మంలో యిటూ అటూ తాత్సారం చేస్తూ, నన్నుప్రశ్నిస్తూ, వత్సల్ని వెతక పంపేటప్పుడు, అతనికి తల దువ్వుతో వెనకనించి ముఖంమీదికి వొంగి చెంపల్ని అనుముతో గోముచేసేప్పుడు, నేనతనిలో పర కాయప్రవేశంచేసి, నీవతాన్ని అట్లానే అదుముకుని, చేతుల్ని అట్లానే బిగించుకుని, కదలకుమని, నీకళ్లల్లో వెలిగే మమతను నాదిగా చేసుకుని తృప్తిపడా లనే వ్యర్థ మైన ఆశ పడతాను.

తార.

సర్వబంధనాతీతులే, మోహాంధకారపటల జ్యోతిర్మూ ర్తులే, నాపైని యీ తుచ్ఛవాంఛ మీ కెందుకు? సర్వలోకనాశనాన్నైనా నిర్లక్ష్యమైన చిరునవ్వుతో వీక్షింపగల మీకఠోరవైరాగ్యం నా అవివేకపు కను వీక్షణంముం దెందు కట్లా దీనంగా మరణవేదన పొందు తుంది? సంపూర్ణవైరాగ్యసంపన్నులైన మీకు నిజంగా

నాపైని, నా శరీరంపైన యీ ఆకాంక్ష మీ తపోగ్నిలో భస్మం కాక మిగిలిందా ?

బృహస్

కాని—కాని—ఎవరినించి ద్వంద్వమనేది లేదో, పరమాత్మతోవలె యెవరితో సంపూర్ణైక్యాన్ని అభిలషిస్తామో, వారు శరీరసంబంధమందైనా మనోవాక్కాయకర్మలలో దేనియందైనా, స్వాధీనులు కాక, విముఖు లవడం యెక్కడో యేదో లోపాన్ని సూచించదా ? ఆలోప మేదా అని పరీక్షించుకుంటున్నాను. (నిదానించి) పిల్లలమీద కోర్కె లేదూ ?

తార.

శశిని చూడక ముందు—శశినే చూడకుండా వుంటే.—వసంతుడివలె లావణ్యమైనవాణ్ణి, చిరునవ్వులతో నా యింటిని వెలిగించేవాణ్ణి, ఆశతో నాముఖ సౌందర్యాన్ని తాగుతున్న చూపులవాణ్ణి, చిన్న యెఱ్ఱని పసిబిడ్డనోరు వాణ్ణి, శశాంకుణ్ణి నావొళ్లో మీరు కూచోబెట్టగానే, అతనిచేతులు నామెడని కావిలించుకుని, ఆ నల్లని ఉంగ్రాలని నావక్షాని కానించగానే, ఆ కోర్కె మాధుర్యంలో కళ్లుమూసుకుని తృప్తిలో నిద్ర పోయింది...యీరాత్రి యిదేమిటి మనసంభాషణ యీ విధంగా పరిణమించింది? యిదంతా పోనీండి గాని, తరవాత చెప్పండి నిన్నరాత్రి సంగతి. మీ దివ్యవాక్కునించి వచ్చేటప్పటికి సాధారణ భాష అమృతరూపాన్ని పొందుతుంది.

బృహస్పతి.

తారా, శశాంకుడిదృష్టి రాధవేపు మరల్చడానికి ప్రయత్నించు.

తార.

నేనా !

బృహస్పతి.

నువ్వే. తప్పదు. అది వాళ్లిద్దరికీ శ్రేయస్కరం.

తార.

శ్రేయస్కరం !

బృహస్పతి.

అవును.

[వెడుతున్నారు.]

———

# అంకం ౨

బుధవారం. శుద్ధద్వాదశి. ఉదయం పదిగంటలు. నల్లని మబ్బులు వేశాయి. పెద్దగాలి వాటిని తరుముతోంది.

మొదటిరంగపు స్థలమే. శశాంకుడూ అనూరాధా అరుగుమీద కూచుని మాట్లాడుతున్నారు.

శశాంకుడికి పద్దెనిమిదేళ్లు, పొట్టి, లావు, చామంచాయ. చిన్న కళ్లు. తళతళలాడే నల్లని పాపలు. అందమైన జుట్టు. అనూరాధకి పదహారేళ్లు. సన్నం వొళ్లు. జాలి పుట్టించే కోలకళ్లు. చిన్నగడ్డంలో కొనతేలే కోలమొహం. నవ్వితే బుగ్గలు సొట్టపడతాయి. మెరుగెక్కువ. శశాంకుడు మాట్లాడుతోవుంటే అనూరాధ కళ్లు వింటున్నట్టు కనపడవు. అతనుమాత్రం తన ఆత్మనంతా తన చూపుల్లో, కంఠంలో పెట్టి మాట్లాడుతున్నట్టుంటుంది.

శశాంకుడు.

ఆకాశంలోంచి కొత్తకాంతి ఒకటి వాళ్ల మొహాలమీద పడ్డది. సముద్రం పొంగింది. అలలన్నీ మందరపర్వతం చుట్టూ మూగి వెనక్కి తగ్గుతున్నాయి. నీటి నీలం లోంచి, కాంతి నిర్మలత్వంలోంచి అలలలో తేలుతో నల్లని చీకటివంటి పెద్దజుట్టు నీటికన్నా మృదువుగా కళ్లని తాకింది. లోకపు దుఃఖమూ, నిరాశా, ద్వేషమూ తనఫాలంలో బంధించినట్లు కళ్లు మూసుకున్న గంభీర సుందరముఖం వుదయించింది. తరువాత బుజాలు, ఏమని వర్ణించను వాటిలావణ్యం! నున్నగా, ఒక్క నీటిబొట్టు పైన అంటక, ఆకాశపునీలం వాటి తెలుపుమీద ప్రలిఫలిస్తో మెల్లిగా, చంద్రబింబాలవలె కొంచెం కొంచెంగా పైకి జారాయి. బుజాలతర్వాతవుబికి, గర్వించి...

అనూరాధ.

యింక వొద్దు శశీ!

శశాంకుడు.

యింక వినవూ ?

అనూరాధ.

ఆ వర్ణన చాలు. నువ్వున్నావా అక్కడ ?

శశాంకుడు.

లేను. కాని వున్నట్టే వుంది, నిద్రపొయ్యే నాకు: ఆమె నడుంచుట్టూ పొంగి, ఆసుఖం చాలక కాబోలు, ప్రియుడి హస్తంలాగు ఉన్నతంగా, ఆమె మెడదగ్గిరికి పాకి, ఆస్పర్శ తీవ్రత కోర్వలేక భగ్నమై వెనక్కి వొంగి ఆమెవెంట పరువులెత్తే చిన అలలను కావా లనిపించింది. నవ్వుతున్న ఆమె పెదవుల్ని పరిమళాసక్తితో తాకే తెమ్మెరను కావా లనిపిరచింది. ఆమె ఒడ్డున కాలు పెట్టడంతోటే నందనవనసహస్రవాటికలు తెరిచినట్టుగా గాలి సమస్త దివ్యపరిమళభరితమై మత్తెక్కి వేళ్లాడింది ఆమెచుట్టూ, వస్త్రంవలె. తన యావనం తనే తాగి మదించినదానివలె వూగుతో ఆ అసమాన సుధామధురమూర్తి నడిచి వొచ్చింది. నడిచిందో, వూగిందో, తేలిందో, వాళ్ళ ముందు నుంచుని అప్పుడు విప్పింది కళ్లని. అనూ!... సారసపత్రాలపైన శోషిల్లిన మధుపాలవలె, మెత్తని చెంపలమీద పొడుగైన వెంట్రుకల బలువుతో మూతలుపడ్డ కనురెప్పల్ని విప్పేటప్పటికి, యెక్కడో దాగివున్న

ప్రణయకాంతులూ, శాంతశబ్దాలూ, సౌమ్యభావాలూ రెక్కలు విప్పి లోకాన్నంతా ఆవరించినట్లయింది. యెన్నడు కాంతి నెరగని మహాపర్వత గుహాంతరాళాల్లోని నలుపు, ఆకాశంలో అనంతాగాధాలు లేవూ, శూన్యప్రదేశాలు— నక్షత్రపుకాంతి నక్షత్రాన్ని కందక మిగిలిన అంధకారాలు—వాటిల్లోంచి తెచ్చుకుంది ఆ కనిపాపల్ని.

అనూరాధ.

వుండు. చూడు శశీ, ఆ కదంబపుష్పాలెట్లా ఆనందంతో ఒకదానివైపు ఒకటి వూగుతున్నాయో!

శశాంకుడు.

నారిని చూచి భయపడ్డట్టు నుంచుని తటాలునచిరునవ్వు మెరిపించింది. సంధ్యారుణ జలధరంమీద మెరుపు పరిగెత్తడం చూడగలవా? నాకు కనపడ్డదప్పుడు.

అనూరాధ.

యిందాకణ్ణించి ఆ పొన్నపువ్వు నందుకోవాలని ఆ సూర్యకిరణం ప్రయత్నం. వాయువు లెన్నివిధాల సాయపడ్డా అందనీక దాన్ని ఆమాతృపత్రం ఎట్లా కాపాడుతోందో!

శశాంకుడు.

(విసుకుతో) వినవా?

అనూరాధ.

వింటోనే వున్నానోయి. చెప్పు.

శశాంకుడు.

యేం చెపుతున్నాను ?

అనూరాధ.

ఆమె చిరునవ్వుల్ని వర్ణించేస్తున్నావు, అమోఘంగా.

శశాంకుడు.

నువ్వు ఆమెను చూసిఉంటే తెలుసును, నాకెందుకో యీ వున్మాదం.

అనూరాధ.

(నవ్వుతో) నువ్వు నిజంగా ఆమెను చూసినట్టేమాట్లాడుతున్నావే !

శశాంకుడు.

రాత్రి కలలో కనపడ్డవాళ్లు నాకు మధ్యాహ్నపు నిజమైన వారికంటె సన్నిహితంగా కనపడతారు.

అనూరాధ.

నాకన్న మోహినే యీవాళ సన్నిహితురాలన్నమాట.

శశాంకుడు.

యీ నిమిషాన ఆ నింబవృక్షం వెనకనించి ఆమె నడిచి వొస్తే నేను చిరపరిచితుడివలెస్వాగతమివ్వనా అనిపిస్తుంది... కాని విను... ఆమె నవ్వు... ముఖసౌందర్యాలకి కారణభూతమైన సృష్టికర్తహృదయంలో ఆనందజ్యోత్స్న అప్పు డుద్భవించింది. ఆమె దయాస్మేర మొక్క—

డెక్కడ తాకిందో అక్కడక్కడ సుందరకాంతులు దిక్కుల తళతళ మన్నాయి.

అనూరాధ.

అంతేనా ?

శశాంకుడు.

కాదు అనూ! అప్పుడు సముద్రఫేనంతో తడిసిన గుండ్రని కాళ్లతో ద్రొల్లుతో ఆమె వేపుపరిగెత్తి, పాదాల దగ్గిర నుంచుని, చిన్న చేతులు జాచి, ఆమె కళ్ల వేపు తలనెత్తాను. నన్ను చూసి కళ్లలోంచి కొంటె సంతోషం వర్షిస్తో పొట్టకింద రెండు చిన్న ముడతలు పడేట్టు వొంగి, నా చిన్ని బాలమూర్తిని పైకి తీసుకుంది. నాతొడలు నిగనిగలాడే ఆమెవక్షాలను ఆనుకున్నాయి. ఆమె చెంపల్ని నారొమ్ము కానించి మెల్లిగారాసింది. ఆస్పర్శ అనూ, దేవత్వాన్ని రుచిచూపిన ఆస్పర్శ కాల్చిందో, కరిగించిందో, పరవశత్వంలో ముంచిందో! తలుచుకుంటే యిప్పుడు నాముఖం ఎక్కడికో వెతుక్కుంటో వొంగుతుంది. కదలని యీ శరీరాన్నించి విడిపడి ఆమెదగ్గిరికి వెళ్లిపోవాలని...వినడం లేదు నువ్వు.

అనూరాధ.

వింటున్నా. కాని చూడు పాపం. శీతాచిలకని, ఆనల్లపిట్ట తినేస్తోంది. పూరేకులమీద నిద్రపోతో, యీ కాంతి సముద్రంలో తేలుతో, యెవరికీ అపకారమూ—

శశాంకుడు.

పిచ్చిదానా, నువ్వానందించే రెక్కల మేఘపు మెరుపు యెట్లా కలుగుతుంది పిట్టకి, యీరంగు కీట కాల్ని భక్షించకపోతే ?

అనూరాధ.

యేమీ! నత్తగుల్లలమీద పంచవర్ణాల్ని చిత్రించిన బ్రహ్మ, ఆ ఆకాశంమీది రంగుల్ని ప్రతినిమషం అతి జాగ్రత్తతో వ్యర్థంగా మార్చేవాడు, పక్షులకుహింసాపరంగా గాక సౌందర్యాన్ని కల్పించలేడా? అణుమాత్రపు ద్వేషమూ, క్రూరత్వమూ, ఘాతుకత్వమూ లేకుండా సృష్టి యేర్పడి ఉండకూడదేమో ? చూడుయీ చల్లని మబ్బులు, గాలికి పువ్వులన్ని రాలుస్తో వూగే యీ శిరీష వృక్షాలూ, మృదువుగా మాట్లాడుకునే యీ శారికా మిథునమూ, యిటువంటి శాంతసుందర ప్రదేశంమధ్య యీ క్రూరహత్య...పోనిలే యీగోల, చెప్పు నీకల.

[శశాంకుడు మాట్లాడలేదు.]

చెప్పుమరి.

శశాంకుడు.

నిజంగా వినాలని వుందా ? నీ మాటలతో నా ఆలోచనలుకూడా చెదిరిపోయినాయి.

అనూరాధ.

నిజం. చెప్పు శశీ.

శశాంకుడు.

అప్పుడు ఆమె నాకళ్లల్లోకి చూసి పకపక నవ్వుతో, నన్నె గరేసి పట్టుకొని, "యెంత బాగున్నావు! పెద్దై నన్ను పెళ్లిచేసుకుంటావా? మళ్లీ మరిచిపోకూ"అని యిక్కడ ముద్దుపెట్టుకుంది. నా వొళ్లంతా వొక్క నా బుగ్గైపోయి, ఆమెపెదవుల దగ్గిర చేరాలని ముణుచుకుంది. ఆముద్దు దివ్యకామమంత్రమై నారక్తంలో ప్రవేశించి శరీరమంతా ఆక్రమించి, దీపించి, యవ్వనవంతుణ్ణి చేసినట్టయింది. యేమో చెయ్యాలని తపించి పోయినాను. నా చేతులు పెద్దవై, శక్తిమంతములై, కఠినమై, నున్నని జారిపోయ్యే ఆమెమెడచుట్టూ—

అనూరాధ.

వొద్దు.

శశాంకుడు.

అంతే. యింకేం లేదు.

అనూరాధ.

నీకోపం వచ్చింది.

శశాంకుడు.

నాకు మెళుకువ వచ్చింది.

అనూరాధ.

నీకు చాలా విచిత్రమైన కల లొస్తాయి శశీ. యెక్కడ

మోహిని! యెక్కడ సముద్రమథనం! నీ కా కల రావడ మేమిటి ? నీ కెప్పుడూ అదే ధ్యాసగావును !

శశాంకుడు.

కాని మోహినీ అవతారం తలుచుకో. మదనాంతకుడైన శంభుడు సిగ్గూ, వొళ్లూ మరిచి విగతవస్త్రుడై ప్రపంచ మంతా పరుగులెత్తాట్ట.

అనూరాధ.

నాకు యిష్టం లేదన్నా యిట్లాంటి సంగతులు మాట్లా డతా వెందుకు ?

శశాంకుడు.

ఇద్దరం కలిసి పాఠాల్లో చదవగా లేనిది నేను వర్ణిస్తే తప్పా; నేనే యిదంతా శ్లోకాలుగా రాస్తేనీకన్నా ముగ్ధలైన కన్య లందరూ వొల్లిస్తారు, మహా ప్రసాదమని. సౌంద ర్యాన్ని చూస్తే, వర్ణిస్తే—

అనూరాధ.

కలలు కంటే—

శశాంకుడు.

తలుచుకుంటే, తప్పా. నువ్వు మొన్న సూర్యోదయ చిత్రిత పూర్వదిశా శోభను చూసి పడ్డ బాధని హేళన చేశానా ? నీ ములుగోరింటమడిలో రంగులపూలతో మురిసి నువ్వన్న సంగతులన్నీ జ్ఞాపకము లేవ్వూ ?

అనూరాధ.

అవి పువ్వులు !

శశాంకుడు.

భేధమేమిటి ? పువ్వులెందుకు! కవివర్ణించిన స్త్రీ ముఖ పద్మంముందు. వాని నన్నింటినీ ఆఘ్రాణించాలని కోర్కె కలుగుతుంది, నాతప్పా ! అట్లాంటికోర్కె కలగచెయ్యాలనే కదూ కవి అంతతీవ్రంగా వర్ణించింది ?...నలకూబరుడూ, రంభా, వారిచరిత్ర చదివితే ఆనలకూబరుణ్ణి చంపి, వాడి సౌందర్యాన్ని జయించి, ఆమహాదేవి లోక పత్నిరంభని పొందాలనిపిస్తుంది. ఆచాతుర్యమూ, పాపమూ కవివే...అంతే కాదు...యెందుకు నవ్వుతావు ? వ్యర్థప్రలాపమనా...అంతే కాదు...నా కళ్లలో జ్వలించే మహారతిదీప్తిని నాముఖంలో నాట్యమాడే మోహాతురతనుచూసి, పార్వతైనా నన్ను వరించివుంటుందనే నా నమ్మకము...యెందుకీ యుగంలో పుట్టానా, సౌందర్యవతులూ, ప్రణయార్ద్రహృదయలూ, అందరూ పరాధీనలై నూత్నరుచిని పోగొట్టుకొన్న తర్వాత యిప్పుడు పుట్టానే అనేచింత కలవర పెట్టేస్తుంది...నేనే తపస్సుచేత బ్రహ్మను సాధిస్తినా, యేం వర మడుగుతానని ?

అనూరాధ.

మోహిని కావాలని.

శశాంకుడు.

కాదు. నాహృదయంలోని భయంకరవాంఛ నన్ను సృ

ష్టించిన విధాతకన్నా అర్థమౌతుందో కాదో! భక్తి, ఆయువు, రాజ్యం కోరినవాళ్లే కాని, వరాల్లోకల్లా వృత్కృష్టమైన యావరాన్ని యెందు కెవ్వరూ కోరలేదో! ......యెవరూ నిరాకరించలేని లావణ్యాన్ని భిక్షమడుగుతాను. మోహినే కాదు. యెవరూ నానించి హృదయాన్నీ నేత్రాల్నీ మరుల్చుకోలేకపోవాలి. నాముఖదర్శనమయిందా, తుషారధవళ సుందరశరీర, నిర్మలహృదయ, విద్యానిలయ, పావనచరిత, వాణి, ప్రచండతీవ్రమోహార్తిచే వున్మత్తయై, సర్వనైతిక, అభిమాన బంధత్యాగమొనర్చి నా పాదధూళి వెనువెంట పరువులెత్తాలి.

అనూరాధ.

యెందుకు శశీ యిట్లా అందర్నీ ఆకర్షించడం ?

శశాంకుడు.

నా హృదయ తృ

అనూరాధ.

ఈవిధంగా సర్వమూ త్యజించి నిన్ననుసరించిన యీ స్త్రీజనాని కంతా నువ్వేమిస్తావు ?

శశాంకుడు.

నన్ననుసరించడమే వారికి మహద్భాగ్యం.

అనూరాధ.

పోనీ, నీ దేహసౌందర్యంతోనే కాని యింక ఏవిధాన ఆక

క్షించడం వృత్తమంగా తోచదా శశీ! అంతేనా స్త్రీనిం
చి కోరేది నువ్వు? అదేనా వున్నతాదర్శం మానవుడికి?
గురువుగారి నడిగావా?

శశాంకుడు.

గురువుగారినా! గురువుగారి సామీప్యానికి వెళ్ళేప్పటికే
నా అంతటి అల్పుడూ, లోభస్వాంతుడూ, స్వార్థపరుడూ
లే డనిపిస్తుందే! గురువుగారి నడగనా! ఆయన ముఖం
లోని తేజస్సంత భయోత్పాదకమైనది త్రిలోకాల్లో
లేదు. ప్రపంచాలన్నీ ఆయన్ని అన్యాయంగా బాధించినా
ఆ కళ్ళల్లోకి కోపం తెప్పించలేరు. సర్వాతీతుడు, తపస్వి;
వెతికివెతికి ఒక్కలోపాన్ని చూడలేము, సూర్యుడిలో
కళంకమన్నా కనుక్కోవచ్చు గాని. అందువల్లనే ఎవరికీ
సాధ్యంకాని దేవగురు స్థాన మిచ్చారు.

అనూరాధ.

అవును. ఆయనతో యెన్నిసార్లో చనువుగా మాట్లాడి,
సందేహాలు తీర్చుకుని ఆనందం వెలిపుచ్చాలనుకుంటాను.
కాని యీ క్షుద్రవిషయాలు ఆయన్ని అంట వన్నట్టుం
టుంది. నిజం... అన్నగారున్నతులు, అమ్మగారికి నాపైని
నిష్కారణద్వేషం. ప్రస్తుతంచనువుగామాట్లాడేందుకు
నువ్వు తప్ప యెవరూ లేరు.

శశాంకుడు.

ఇంక వేరుగతి లేకనా నావాగు డంతా వినడం?

అనూరాధ.

(నవ్వుతో) అవును. అన్నగారే చనువు నిస్తేనా యింక నీ మొహం చూసే దెవరు?

శశాంకుడు.

అన్నగారు హృదయవాంఛని తీరుస్తారా?

అనూరాధ.

అన్నగారివంక చూస్తే వాంఛలు భస్మమౌతాయి.

శశాంకుడు.

కాని నామీది వాంఛ చల్లారేది కాదు.

అనూరాధ.

(నవ్వుతో) నీఅంతటి అహంభావపూరితుణ్ణి నేనెక్కడా చూడపోను. సమస్త దేవకాంతలూ నిన్నుచూసి మూర్ఛపోతారంటావు. నువ్వు లేనిదే నేను నిలవలేనట! నువ్వు పుట్టకముందు మనుష్యుల్లో సౌందర్యం లేదనా, నువ్వు లేకపోతే యింకెవరికీ భర్తలు దొరకరనా? యేమిటి నీ వుద్దేశ్యం?

శశాంకుడు.

అహంభావమేమిటి? నాకు తెలీదూ! స్త్రీలందరూ నాకు తెలిసేటట్టుచేశారు, నా ప్రభావం. నాకు జ్ఞానమూ జ్ఞాపకమూ ఉన్నప్పణ్ణించి ప్రతినిమిషం యే స్త్రీ హస్తాల్లోనో తప్ప గడపలేదు. ఇంటిదగ్గర వుండనీక యెవరెవరో స్త్రీలు నన్నెత్తుకుపోతోవుంటే, భయపడి, అంత చిన్నప్పుడే,

యీ ఆశ్రమానికి పంపేశింది అమ్మ. మూడేళ్ళకిందట యీ అమ్మగారితో నేను దేవనగరికి వెళ్లినప్పుడు, ఆ వారంరోజులూ శచీదేవి నన్ను తనపక్కన పడుకోబెట్టు కుంది. రంభ, ఊర్వశి, మేనక, నన్ను పగలంతా వ్రాపి గాడకుండా నలిపేశారు. ఆ దేవవేశ్యల లావణ్యంతో మురిసి, మైమరచి ఆడుకునేవాణ్ణి. వాళ్లొక తేనవ్వులు. "అట్లానే నాయనా! తయారవుతున్నావు" అని నా చెం పలమీదకొట్టి, మళ్లీ నా చేతులు ముద్దుపెట్టుకుని ఆ మెరిసే వక్షాలమీద ఆనించుకుంటూ న్నన్నగా...యెందు కు ఆ చక్కని కనుబొమ్మల్ని మధ్యకు లాగుతావు?... పోనీలే మానేస్తాను...నేను చాలా గొప్పదశను అను భవించబోతున్నాను అనూ!

అనూరాధ..

ఆ నీలపుపక్షి చూడు. ఆ కొబ్బరిచెట్టు తొర్రలో దాని గూడు. మొన్నటినుంచి ఘూక మొకటి దానిగూటి నాక్రమించుకుని తరుముతోంది యీమెను. పాపం అక్కడ వాలింది. గాయపడిందేమో?

[అతనివంక చూడక వెళ్లిపోతోంది. శశాంకుడు "పిచ్చిదా!" అన్నట్టు ఆమెవెనకనే చూస్తున్నాడు.]

———

# అంకం 3

[బుధవారం శుద్ధద్వాదశి సాయంత్రం ఆరున్నరగంటలు. ఆశ్రమం వెనక పువ్వులతోట.]

తార తలంటి పోసుకున్న జుట్టు వొదులుగా ముడివేసుకుని తల్లో శిరీషపుష్పాలు పెట్టుకుంది. తెల్లనిచీర కట్టుకుని, చంపక వృక్షం మీద చెయ్యేసినుంచుని, దూరంగా మాట్లాడుకుంటున్న, శశాంకుణ్ణీ, అనూరాధనీ చూస్తోంది. అప్పుడప్పుడు శిష్యులు చెట్లకి నీళ్లు పోస్తూ నవ్వుకుంటూ తిరుగుతున్నారు.

కొంచంసేపట్లో కడవలు పట్టుకుని శశాంకుడు, అనూరాధా నవ్వుతో యింటివేపు వచ్చారు.

శిష్యులు వేదగానంచేస్తో మొక్కలకి నీళ్లు పోస్తున్నారు. తార వొచ్చి నుంచుని చూస్తోంది. తరవాత అనూ, శశీ వొచ్చారు.

అనూరాధ

మేరుపర్వతంకాదు భూలోకమే అనరాదూ!
అలిసిపోయినాడయ్యా! అంతసుకుమారం!

తార.

రాధా, అమ్మమ్మగారు నిన్ను దీపారాధనకి పిలిచారు.
(యిద్దరూ కడవల్ని కింద పెట్టారు.)

అనూరాధ.

శశీ, నువ్వు రా, మళ్లీ వొచ్చేద్దాం, యిప్పుడే.
(శశాంకుడు వెళ్లిపోతోవుంటే తార అతన్ని కళ్లతో ఆపింది.)

శశాంకుడు

నువ్వు వొచ్చిందాకా యిక్కడే వుంటాను. తొరగా రా

అనూరాధ.

రద్దూ! ఒక్క నిమిషం నువ్వు గదిపలో కూచో, నేనూ మాట్లాడుతూనే వుంటా; యింతలో వొచ్చేస్తాం. నువ్వు లేంది తోచదు (చెయ్యిపట్టుకు లాగుతోంది. శశాంకుడు నెమ్మదిగా వొదిలించు కున్నాడు.) పోనీలే మళ్లీ వస్తా నేమో చూడు. (వెళ్లిపోయింది. శశాంకుడు తార దగ్గి రిగా నుంచున్నాడు.)

శశాంకుడు.

సూర్యాస్తమయమూ చూస్తున్నారు అంత నిదానంగా! యీ ప్రశాంత సమయాన్ని దేవతలు పశ్చిమదిశ ఖేలనా వినోదం సలిపే రంగస్థలమని వర్ణించాడు మైత్రేయుడు. అదా అనుభవిస్తున్నారు?

తార.

సూర్యాస్తమయ కాంతిలోనూ, అనూరాధ దరహాస చంద్రికల్లోనూ మెరిసే నీ ముఖాన్ని.

శశాంకుడు.

అను ఆ రంగుల్ని చూసి పరవశత్వం చెందుతుంది. ఎరుపూ, పసుపూ కలిసిన చోటు లేదూ, వొంకరగా, నదిలోయిసికతిన్నె వలె, ఆకాశపు నీలంలో తేలుతోంది. అప్పుడే కొంచం నలుపు వస్తోంది, దాంటో పడుకోవాల నిపిస్తుందిట.

తార.

రాధకి దాన్ని మించిన మృదుత్వం చూడ్డానికి కళ్లు లేవు.

శశాంకుడు.

ఎక్కడ ?

తార.

భూమీ, ఆకాశమూ కలిసినచోటువలె సౌందర్యదీపితమై కంఠమూ, చంపలు కలిసేముద్దులొలికే ఆవొంపువద్ద.

శశాంకుడు.

రాధకి కనపడని సౌందర్యంలేదు......ఆ మబ్బుల్లోకి రమ్మంటుంది నన్నుకూడా.

తార.

వెడతావా ?

శశాంకుడు.

చూడండి......చీకటి పడుతోంది. ఆ కొంగవొక్కటే ఆ నల్లని మబ్బుమీద......యెక్కడికో వెడుతోంది. ......యేమైదానం చివరవున్న శిధిల వృక్షపు తొర్ర లోనో, సముద్రపుదూర తీరముమీది కొండశిఖరంలోనో ......యీ గాలికి చెట్లు వూగితే, అను, అవి సంతోషిస్తున్నాయి అంటుంది. ఆకులు మీదనించి నీళ్లబొట్లని విదలిస్తే పావురాలంటుంది వాటిని. మొన్న లేడి యీ మామిడిమొక్కని రుచిచూస్తే రోజల్లా కంటతడి పెడుతోనేవుంది. అంత మార్దవమైన హృదయాన్ని చూశారా, అమ్మగారూ......యిప్పు డింటిలోకి వెళ్లిందా, మళ్లీ వొస్తుంది. యీ మొక్కలకి చీకట్లో భయంట. వాటితో మాట్లాడి, యీ చిన్న వాటిని పెద్దచెట్లకి

వొప్పచెప్పి పాటపాడి వొస్తుంది......రాత్రి పాడింది కదూ, మీకు వినపడ్డదా? నిద్దట్లో నన్నాసరే, మూర్ఛల్లో నన్నాసరే, మృత్యువుల్లో నన్నాసరే రాధ సంగీతంవిన్నా నంటే, తలెత్తి చూస్తాను. ఒక కంఠపు మెలికలో నన్ను గాని, యెవర్నిగాని, తన దాసుణ్ణి చేసుకుంటుంది. నిజం గానే, అను, గొంతెత్తితే యీ మొక్కలన్నీ ఆవేపు తల వొంచినట్టే వుంటుంది. ఆమె పాటే యీ ఆకుల్లో దాక్కుని తెల్లారి పూలుగా మారుతుంది. చీకట్లో తన కోసం తనకంఠం కోసం వెతుక్కుంటాయిట. వాటినొక పట్టాన వదల్లేదు.

తార.

విన్నా !

శశాంకుడు.

చిన్నప్పట్టి, ఒకసారి చంద్రగ్రహణం పడితే, అను, క్షీణించే చంద్రుణ్ణి చూసి "అయ్యో, నా చంద్రుణ్ణి మింగేస్తున్నారు." అని యేడ్చిందిట.

(అనూరాధ వొచ్చింది.)

అనూరాధ.

శశీ! యింకరా.

శశాంకుడు.

వొస్తున్నా (అల్లరిగా అనూరాధవేపు చూస్తో తారతో) ఆ ప్రేమే, ఆమృదుత్వమే, ఆ సౌందర్య పిపాసనే వొలికిస్తుంది తన గీతాల్లో......రాత్రి విన్నారు కదూ?

(అనూరాధ సిగ్గుతో తల తిప్పుకుంది.)

అనూరాధ.

నేను వెడుతున్నా. నువ్వు రాకపోతే.

శశాంకుడు.

వస్తున్నా (తార మొహంవంక చూసి వెళ్ల లేక ఆగాడు)

అనూరాధ.

నువ్వొచ్చిందాకా వకుళ వృక్షం కింద వుంటాను.

(అనూరాధ వెడుతోంది. శశాంకుడు ఆ వేపు వెళ్లేట్టు తిరిగాడు. తార అతని భుజం మీద వేసిన చెయ్యిని అతన్ని వుండమన్నట్టు కొంచంగా బిగించింది. అనూరాధ వెళ్లింది. అతను ఉండి పోయినాడు. తార నిదానంగా శశాంకుడివంక చూస్తోంది. శశాంకుడు ఆ చూపు కింద యిబ్బంది పడుతున్నాడు. శిష్యులు వెళ్లిపోయినారు.)

శశాంకుడు.

సంధ్యార్చనకి వెళ్లాలండీ. (తార మొహాన గంభీరమైన బాధ ఆవరించింది.)

తార.

శశీ, శశీ, నా హృదయం చీల్చేస్తున్నావు. నిజం చెప్పు. యెందుకు వెళ్లాలంటున్నావు? మొన్న సాయంత్రం పాఠం చదవాలని వెళ్లి యేంచేశావు? నా దగ్గిర నుంచోడం నీకంత కష్టమై పోయిందా? నా దగ్గిర! యెంత బాధపెడుతున్నావోయి!

శశాంకుడు.

యేంచేశానండీ?

తార.

నన్ను మరిచి పోతావా? నన్ను తక్కువచేస్తావా?

శశాంకుడు.

మిమ్మ న్నా! మిమ్మన్ని మరిచిపోవడ మేమిటి?

తార.

కాని నాయనా, యిట్లా నన్నల్లుకుని, ముద్దు మాటల తో యీ హృదయంలో లీనమైపోయి నాకు వేరే జీవనం లేకండా నా అస్తుల్లో పెనవేసుకుని, నా కాలాన్ని, మనసుని, అంతా, ఆక్రమించుకొని అన్ని వేపులా నువ్వేఐ, నీ బేల చూపులతో, నాదిశలన్నిటినీ నింపేసి, యెప్పుడో యెగిరిపోతే.........

శశాంకుడు.

నే నెక్కడికి వెడతానండీ!

తార.

అవును నాయనా, చెట్లవలె వేళ్లు బారి పాతుకుని నిలిచింది మేము. మాహృదయాల మీద కాళ్లు మోపి, మొడనాలుగు వేపులా జూచి లోకాన్ని వెతికేది మీరు.

శశాంకుడు.

యేమిటి అట్లా అంటారు? అపరాధ మేమిటి!

తార.

(శశాంకుడి గడ్డం పట్టుకుని) నన్నూ, నాప్రేమని నీకు తా

గించుకుని పెంచుకున్నాను. నా గర్భంలోకి నిన్ను తీసుకుని మళ్ళీకన్నాను. నా చిన్నప్పటి కలలు, కన్యాత్వం, యవ్వన మాధుర్యం, తపస్సు, ఆనందం, అన్నీ నీలో నీ రూపంలో మూర్తీభవింప చేసుకున్నాను. నీ వుంగ్రాలజుట్టు నాకళ్ల కికప్పి నాకింకేమి కనపడకుండా చేశావు. నీకళ్ల మాధుర్యంలో నన్నుముంచి, నీమాటల మృదుత్వంలో నన్ను కరిగించి నేనెవరినో తెలీకుండా మార్చేశావు. మెత్తని నీ జుట్టుని యీ వేళ్లతో చిక్కుతీశాను. నీ తల్లికోసం కార్చే కన్నీళ్లని, నా చెరుగుతో తుడిచి, నాకళ్ల కాంతిలోని విరహ బాధని వెలిగించి మాన్చాను. అర్థరాత్రి చెడ్డ కలలొచ్చి "అమ్మా" అని వెతుక్కున్నప్పుడు నీపక్కన పడుకుని, వుండు, మాట్లాడకు, నిన్నెవ్వరికీ యివ్వను. నా దగ్గిర్నించి తీసుకుపోవాలని, నిన్నెవరన్నా పిలిచారా, తాకారా, ఆడపులివలె మీదపడి, చీలుస్తాను రెండుగా, నీ హృదయాన్నెవరన్నా వశపరచుకోవాలని చూశారా, ఆహృదయ వుష్ణరుధిరం తాగుతాను..యిట్లాచూడు... ...కదలకు......నువ్వు నాప్రాణం. నా జీవనం, నాలోకం, నావాడివే, అంతా, పూర్తిగా, నా పుత్రుడివి, మిత్రుడివి, నానాథుడివి, దైవంనువ్వు. నువ్వుతప్ప నాకింకేమీ లేదు. అక్కర్లేదు, నువ్వే నాప్రపంచం, ఆత్మ, నా ఆనందం. నువ్వు లేకపోతే, నువ్వు నానించిపోతే, నువ్వు నన్ను మరిచిపోతే నేనేం చెయ్యను ? నాకింకేముంటుంది ? అంతమూ ఆశాలేని ఆశూన్యానెట్లాభరించను ?......

చూడు నన్ను బాగాచూడు. నాకు...ధగధగమెరిసి లో కాన్నంతా కోర్కెతో తాగాలని చూసే నీకళ్లకి, కావ లసిన మాధుర్యం, లావణ్యం ప్రణయం అన్నీ నేనిస్తాను. నీ కిం కేంకావాలి ? యెవరుకావాలి అట్లా వెతుకుతావు ? చేతులు జాస్తావు! పరిగెత్తుతావు?...నన్ను నా సామ ర్థ్యాన్ని నీ వెరగవు. దేవతా శ్రేష్ఠులందరూ, అస్ఖలన మహాయోగులందరూ, యెవరినించి ఒక్క చిరునవ్వును కాంక్షించి, ప్రయత్నించి, విఫలమనోరథు లైనారో, తలచినంతమాత్రాన త్రిలోకాధిపత్యాన్ని వహింప సామ ర్థ్యమున్న అనంతశక్తిని నేను. సహస్రహస్తాలతో నేత్రా లతో నీకు కావలికాస్తాను. అన్ని భయాలనించి ఆపదల నించి సహస్రనూత్న హృదయానుభవాలతో, అనంతసు రుచిర రూపలావణ్య రూపసంపదలతో నీకు దివ్యసౌఖ్య మిస్తాను...వుండు-విను...నన్ను మరిచిపోయి లోసేసి, కృతఘ్నుఁడవై విషమ......మాట్లాడకు...లేచావా, యింకోవేపు చూశావా, యింకోకంఠం విన్నావా... (శిష్యులగానం.)

(ఆవేశం యెక్కువై మాట్లాడలేక పోయింది. కొంచం సేపు వెర్రిగాచూసి తెప్పిరిల్లింది) యేమిటి ? యేమిటిది ? నా తల తిరుగుతోంది, లోకమే మారిపోయింది, యెక్క డున్నాను ? నువ్వెవరు ?...చూడు శశీ ! నువ్వేనా ! శశీ! నువ్వేనా ?...మాట్లాడు...గాలా ? ఈ పుష్పకంఠ రవ మా ? విమానాల్లో గంధర్వకన్యలా ? యీ నక్షత్రాల్లో

దేనికన్నా వివాహోత్సవమా ?...ఆకాశం పువ్వుల్ని రాలుస్తోంది. లోకదీప్తి తన సౌందర్య భావంతో బద్ధలై నక్షత్రాలై రాలుతోంది......అబ్బా...శశీ...నా చిన్ని శశీ...శశీ యెవరు నువ్వు ?...యెందుకిట్లా యివాళ !
(శశాంకుణ్ణి చేతిదూరాన్న పట్టుకుచూస్తోంది. యింతలో శిష్యులు మళ్లీ ప్రవేశించారు.)

# అంకం ౪

గురువారం. శుద్ధత్రయోదశి మధ్యాహ్నం నాలుగు గంటలు. మబ్బుల వెనుకనించి తళతళలాడే తెల్లని కొత్తకాంతి చెట్లమీద పడుతోంది. మొదటరంగపు స్థలమే. అరుగుమీద కూచుని తార ప్రక్కన పడుకున్న శశాంకుడితో మాట్లాడుతోంది.

తార.

నువ్వు చక్రవర్తివైనా కాకపోయినా—

శశాంకుడు.

అదుగో! మీకూ సందేహమేనా?

తార.

కాదోయి. నీకు చక్రవర్తిత్వమొక కష్టసాధ్యమా! అది కాదు. నువ్వు చక్రవర్తివి కాకపోయినా, వుత్తినాచిన్ని శశాంకుడివే ఐనా నీకు—

శశాంకుడు.

నా నూతనపరిపాలనంలో లోకం యిదివరకెన్నడూ లేని ఔన్నత్యాన్ని పొందుతుంది. గురువుగారు బోధించే క్షమా, కఠోరదీక్షా, ఆత్మస్వాతంత్రమూ, అన్నిటినీ, నారాజ్యమంతా స్థాపించి నడిపిస్తాను, వసిష్టపౌరోహిత్య దీపితరామరాజ్యంవలె వినుతికెక్కుతుంది నా సార్వభౌమత్వం.

తార.

కానిగురువుగారి ఆత్మోన్నత్యమూ, నైతికపరిణామశాస్త్ర

మూా మహాపురుషులకే అనంగీకారమే. నీరాజ్యంలో సామాన్యప్రజామధ్యాన్ని యెట్లా ప్రతిష్టిస్తావో యి. మొన్న అత్రిమహామునికీ ఆయినకీ జరిగిన వాదనవిన్నావుకదూ? యెన్ని యుగాల పురాతనత్వంకింద మూలుగుతున్నాయో వాళ్ల భావాలన్నీ! యింతటి రుషులూ, శమదమయుతులు, యీశ్వరదయాసంపన్నులు, వీళ్లుకూడా నూతన సంస్కారమూ, నిర్మలకాంతిప్రదేశము అనేటప్పటికి ప్రపంచక్షోభ సంభవించినట్టు అదిరి పడతారు ఆలోచన లేకండా.

శశాంకుడు.

గురువుగారు వారి భావాల్ని ప్రచారం చెయ్యరు. యితరుల మానసాలకు అతీతముకదా యీ వృత్తమజ్ఞానబోధ; ఆకాంతి అల్పమేధాదృష్టిగల సామాన్యులని అంధుల్ని చెయ్యదా అని భయముకాబోలు. అందువల్ల ఆయనకి ప్రపంచత్యాగీకారభావం హెచ్చని వాదు పడ్డది. కాని గురువుగార్ని యిన్నాళ్లూ శుశ్రూష చేసి పొందిన మహోన్నత విజ్ఞాన సంపదకి ప్రతిఫలం నేనే మివ్వగలను? యీయన స్వప్నాలుకని ప్రచారం చెయ్యలేని యీ ఆదర్శాల్ని నా రాజ్యంలో శాశ్వతంగా నెలకొల్పుతాను.

(అనూరాధ ఉత్సాహంగా వొచ్చింది.)

అనూరాధ.

యింక రా శశీ

శశాంకుడు.

అప్పుడే వొచ్చావే!

అనూరాధ.

(పుత్సాహ రహితంగా) యెంతవరకు చదివావు?

శశాంకుడు.

ఒక్కరవ్వకూడా

అనూరాధ.

యేం?

శశాంకుడు.

అమ్మగారున్న చోటికి సరస్వతి రారు. భయం.

అనూరాధ.

(తారతో) అసలే సోమరి. అన్నగారి ఆగ్రహానికి దడిశి యీాయన యింతమాత్రం విద్యనేర్చాడు. కాని యింకో ఆశ్రమంలోనే, ఐతే, ఆ గురువుగారికే పాఠాలు నేర్పే వాడు. మీారతన్ని లాలనచేసి శుద్ధ అవివేకిని చేస్తు న్నారు. (ఎవరూ మాట్లాడలేదు, అనూరాధకి కొత్తగా తోచి ఆగింది. కొంచంసేపెవరూ మాట్లాడ లేదు.) (శశాంకుడితో) మరిరావా

శశాంకుడు.

(ఆవలిస్తో) యిప్పుడెక్కడికి? అప్పుడే? యింత తొందరెందుకు?

అనూరాధ.

నేను వెడతాను. (లేచింది.)

శశాంకుడు

(నవ్వుతో) ఇంత పురుకుబోతుదాన్ని యెక్కడిన్నా చూశారూ, అమ్మా!
(అనూరాధ వెళ్లిపోయింది. శశాంకుడు లేచాడు)
తీసుగొస్తా వుండండి.

తార.

వెళ్లకు, ఆ వేషమంతా యెందుకో తెలీటంలా?

శశాంకుడు.

వేషమా!

తార.

అవును, దానివల్ల నువ్వు మోసము పోతావా?

శశాంకుడు.

మోసమేమిటి?

తార.

అట్లా చూస్తావేం? శశీ, సకలబంధనాల్నీ కాల్చిన రకంలోనైనా హృదయాల్ని వెంటయీడ్చుకుని నిర్లక్ష్యంగా నడవగలసౌందర్యమిట్లా వ్యర్థమైపోతోందే అనే నా చింత. సమస్త స్త్రీలోకమూ నిన్నాశ్రయించి, నీదరహాసానికై తపించి, ఆరాధించాలి గాని, నువ్వితురులకు

దాస్యంచేస్తోవుంటే నేను సహించగలనా? నువ్వుశశివి! నిన్ను నీలావణ్యామృతాన్ని బాల్యంనించి నా ప్రేమామృతం పోసుకుని పెంచుకున్న తరువాత, నిర్లక్ష్యంగా అంత అమూల్యమైన

శశాంకుడు.

(పరధ్యానంగా) అనూరాధ సరళత్వమే, అల్పత్వమే, నన్నామె స్నేహానికి అనర్హుణ్ణి చేస్తున్నాయి.
(తార యీర్ష్యతో నోచ్చుకున్నట్టుయింది. శశాంకుడు చూడడు.)

తార.

సరే వెళ్లు.

శశాంకుడు.

తొరగా వొస్తా నిప్పుడే (శశాంకుడు వెళ్లాడు. తార లేచి నుంచుంది.)

తార.

యేమిటీ హృదయవేదన నాకు! యీ వాంఛా జలధికి తీర మెటువంటిదో కదా! నిగ్రహ మసాధ్యమా! అవసరమా! ధర్మమా! కాని......కాని...అపజయము నంగీకరించి, శశిబిక్షుకై యీ అనూరాధని, దిక్కులేక నా శరణజొచ్చిన యీ అవివేకిముందు......ప్రణయామృతా అన్వేషిస్తున్నావు, శశీ, నేనియ్యలేనా! తారను నేను.

(ఆలోచిస్తో, మొహంలో బాధ కనపరుస్తో నుంచుని,

వెళ్లింది కొంచంసేపట్లో అనూరాధా శశాంకుడూ వొచ్చారు)

అనూరాధ.

మరి యిందా కెందుకట్లా ఐనావు?

శశాంకుడు.

అమ్మగారు వెళ్లి పోయినా కే!

అనూరాధ.

శశీ, అమ్మగారట్లావున్నా రేమి యీ దినము? పూర్వా హ్నము తల వొంచుకొని గురువుగారితో యేదో జాగ్రత్తగా మాట్లాడుతున్నారు. ముఖమెత్తక, బొటనవ్రేలు కిందరాస్తో, యేవేవో తీవ్ర సమస్య లడుగుతున్నట్టు కన పడ్డారు. అన్నగారిని కొంచం ప్రక్కగా ఆనుకుని, ముఖ మాయన బుజంవైపు తిప్పి అమ్మగారునుంచుంటే చూ డ్డాని కెంత శోభాయమానంగా వుంటుందనుకొన్నావు! నిర్మలాకాశం వెనకగా, స్థైర్యంతోనుంచున్న తాటి చెట్టు మధ్యాన్ని కావిలించుకుని, కాంతికై పైకిచూసే గుబురైన జువ్విమొక్క లాగుంటారు......
(గొంతుమార్చి) ఆ వృక్షశాఖ నధిరోహించి త్రుళ్లింత లాడే మర్కట కిశోరము నువ్వు.

శశాంకుడు.

ఆ వృక్షాగ్రాన్నెక్కి తన పంచమ స్వరముచే వనము నంతా పులకరింపచేస్తున్న పికము నీవు.

అనూరాధ.

నిర్దయుడనై చంపకు......(ఆలోచనగా) నీతో యిట్లా నవ్వుతో మాట్లాడతానన్న మాటే కాని చాలాసార్లు నిన్ను చూస్తే నాకు కోపమొస్తుంది.........నావంక యేదో తమాషాగాచూస్తావు......యెట్లానంటే..... నన్ను చూస్తున్నట్టుంటావా, అప్పుడుకూడా నావెనక యెవర్నో చూస్తున్నట్టుంటాయి నీ కళ్లు......దొంగ కళ్లవి. ఒకటి చెపుతోనే ఉంటాయి. యింకొకటి ఆలోచిస్తోనే ఉంటాయి.

శశాంకుడు.

కాని నిన్నుచూస్తే నాకు చాలాసార్లు భయం, నేనేం మాట్లాడినా ఆ మాట్లకంటె ఎక్కువ అర్థాన్ని, నాకే తెలీని నా రహస్యమనోభావాల్ని, సంపూర్ణంగా తెలుసుకుని నవ్వుతున్నట్టుంటాయి లోతైన నీ చూపులు.... అవును నిన్నర్థం చేసుకోవాలనే నా ప్రయత్నమంతా. ఎట్లానంటే.........

(మెల్లిగా మొదలుపెట్టి అనూరాధ పాడుతోంది. ఆపింది)

అనూరాధ.

ఎట్లా ?

శశాంకుడు.

ఆపవొద్దు, పాడు.

అంతంకాకండా పాడు. ఈ జీవాన్నిట్లా నీపాటలో కలిపెయ్యనీ. ఈ భూమినివొదిలి, అంతంలేని ఆకాశంలో

నక్షత్రాలమధ్య ప్రయాసంకాని ప్రయాణం చేస్తు న్నట్టుంది.

(అనూరాధ పాడుతోంది. మధ్యలో ఆపి శశాంకుడు మాట్లాడుతో వుంటాడు.)

నువ్వు పాడిందాకా సంగీతమంటే యింతయిష్టమని నాకు తెలీదు. యెందరెందరో పాడితే విన్నాను. ఇంద్ర సభలో కిన్నరుల గానప్రభ, మేఘరథాల్లో గాంధర్వవిద్య ననుభవించాను. కాని నీ కంఠంలో నేముందో నన్నిట్లా కలవర పెట్టేస్తుంది. యిది కంఠపు మార్దవం కాదు. ఆత్మమాధుర్యమే నా హృదయంలో యిట్లా మారు పలికిస్తుంది కాబోలు! గాఢమూ, మనోహరమూ ఐన బాధ పడతాను. నేను సగమెరిగినవి, నేనందుకో లేనివి ఐన ఏవో ఆదర్శాలు తోస్తాయి.

(అనూరాధ పాడుతోంది.)

(మధ్యలో) నువ్వుపాడితే సృష్టిలోనించే, ఆమాధుర్యం వొలుకుతున్నట్టుంటుంది. వెన్నెలలాగు మల్లెపూవరి మళంవలె, అట్లా వొచ్చేస్తుంది అమృతవర్షంవలె

(అనూరాధ పాడతోంది.)

ఆ పాట వింటోవుంటే, నాహృదయములో యెన్ని వున్న తాలైన భావవీచికలు లేచి కలవరపెట్టేస్తాయో. ఆనిమి షాన యెన్నో శక్తులు నాలో విజృంభించి పెనుగులాడ తాయి, రూపధారణంకొరకు. నేనుకూడ పాడతానేమో,

గీతాలురాసేస్తానేమో, నువ్వు పాడేభావాలన్నిటినీ రంగు ల్లో చిత్రిస్తానేమో అనిపిస్తుంది.

(అనూరాధ పాడుతోంది. శశాంకుడు మెల్లిగా ఆమె వొళ్లో పడుకున్నాడు)

వొద్దు, అనూ, చాలు. నేనింక భరించలేను.

అనూరాధ.

పాడితే నాకు చెప్పలేని ఆనందము కలుగుతుంది. నా హృదయంలో గడ్డకట్టిన దుఃఖమంతాకరిగి కారిపోయి నట్టుంటుంది నాకు. నా విచారమంతా మా అమ్మ మీదిప్రేమ, ఆమె మీదివిరహం. నా వంటరితనం, నా విఫల మనోరథం, యీ అమ్మగారికి నామీద నిష్కా రణ ద్వేషం అన్నీ పాటల్లో పాడితే మనశ్శాంతికలుగు తుంది. పాటలే నా మిత్రులు, అవే నాజీవితం.

శశాంకుడు.

నేనూ

అనూరాధ.

పాటలెప్పుడు పిలిచినా, నిరాకరించక, సహృదయులై, నన్ను సంపూర్ణంగా ప్రేమించి, ఎన్నడూ వీడని పరమ బంధువులు

శశాంకుడు.

నేనో,

(అనురాధ పాడుతోంది.)

శశాంకుడు.

వొద్దు, అనూ, ఇంక భరించలేను.

(అనూరాధ వినిపించుకోదు. శశాంకుడు రెండుమూడు సార్లు ఆపాలని చూస్తాడు. కాని అనూరాధ ఆ పాట ధోరణిలో నిలపడం ఇష్టములేక ఆగదు.)

(మధ్యలో) పాడవద్దన లేదూ (అనూరాధ వినిపించుకోక పాడుతోంది.) (మధ్యలో) అనూ! అనూ! ఎక్కడిదానివి! నా హృదయం తోలిచేస్తున్నావు, యిట్లారా.

(చేతులు ఆమె వేపు జాస్తున్నాడు. అనూరాధ తటాలున లేచి నవ్వుతో పరిగెత్తింది. వొళ్లోంచిజారి తలకి దెబ్బ తగిలి శశాంకుడు వెనకపరుగెత్తాడు)

అనూరాధ.

(నవ్వుతో) పాపం, నీకు దెబ్బతగులుతుందనుకోలేదు. నీ మొహం యెట్లాపెట్టారని. సంగీతమూ, రసాస్వాదమూ, హృదయ వేదనా, అన్ని మాయమయినాయి ఒక్క పాటతో. నాకుమోహిని కావాలికదూ అట్లామొహం

శశాంకుడు.

వొచ్చి కూచో

అనూరాధ.

నిన్నానమ్మేది. కొలనుముందు.....జ్ఞాపకము లేదూ,

శశాంకుడు.

అది నాతప్పుకాదు. జడల్లుకుంటో వొయ్యారంగా నుం

చుని, క్రీగంటితో చూసినప్పటి నీముగ్ధసౌందర్యం బాధ్యూ
రాలు.

(మాట్లాడకండా అనూరాధ అతన్ని కోపంగా చూస్తోంది.) పైగా నిజంమాట్లాడితే నిష్ఠూరం మీ నేత్రాల అల్లరిచూపులతో, కంఠస్వరపు తేనె మార్పులతో, తల తిప్పేప్పటికి మెడదగ్గిర అలలవొంపులతో కావలసి మన స్ఫూర్తిగా, మాకుకలిగించే ఆశలూ, పంపించే శబ్దం లేని ప్రణయ ఆహ్వానాలూ, కనుపడని ప్రేమలేఖలూ యెవరికి తెలీవు. మూఢులమై మోసపోయి మీపాద దాసులంకాగానే, మీ కటాక్ష వీక్షణాలకై మోకరించ గానే అనౌచిత్యమనీ, అశ్లీలమనీ మాకునిందలు...... పోసి యిప్పుడు చూడు. యెంతసేపటినించి పాడవొద్దని బతిమాలుకుకుంటున్నాను? ఆగవా? నన్నాకర్షించి, నన్ను పాదాక్రాంతుణ్ణి చేసుకుని ఒక్కమృదువైన తన్ను తన్నడానికే కదూ! (అనూరాధ భుజంమీద చెయ్యేసి బుజ్జగించ పోయినాడు. అనూరాధ దూరంగా జరిగింది)

అనూరాధ.

చూడు యీచల్లసిగాలినించి స్పర్శనాసౌఖ్యాన్నెంతగా అనుభవిస్తున్నాయీ ఆ కలవలు! నమ్మవు నాకు తెలుసు ......చిన్నప్పుడు అమ్మ నాతలనాఘ్రాణించి చంపకం కూడా అంతపరిమళంగా వుండదనేది ఆమాట నమ్మ గలవా?

శశాంకుడు.

(అర్థయుతంగా) నాకేం తెలుసు ?

అనూరాధ.

(కోపంతో) అదంతా చాల్లే...(నిదానించి) ఆ కలవల ఆనందం, సంతోషరవం నాహృదయంలో పలుకుతోందే.

శశాంకుడు.

(అల్లరిగా) గాలికి సర్వమూవూగుతాయి, కలవలనే ఏమిటి ?

అనూరాధ.

(కోపంతో) అంధుడా గాలికే కదిలితే కలవ రేకులన్నీ ఒక వేపు వూగాలిగాని, కొన్ని యెదురూ, కొన్ని పైలూ, కొన్ని ప్రక్కలకు ఊగుతాయా ! వీణ తంతులవలె అను కంపపడే తల్లి పెదవులవలె, చేతికింది పావురపు రెక్కల వలె.........ఓహో ఎంతగా వూగుతుందనుకున్నావు హృదయం! ఆ పుష్పాల్లో ఆ తెలుపు మెరుపులో ఆనిర్మల త్వంలో ఎట్లాగో కలిసిపోవాలనిస్తుంది. ఆ ఇందీ వరవిశా ల హృదయంలో ముఖాన్ని అద్దుకుని ఆమృదుశాంత సందే శాన్ని వినకలుగుతే (ఆవేశంతో) చివరికి యీ గడ్డి పువ్వులు—వుదయం కొత్తనవ్వులతో పులకరింపులతో వేయెరుపు చాయలతో అప్పుడే నిద్రలేచిన వాయువు అల్లరులతో తన అందాన్ని తనే చూసుకుని ఆనందపడుతు న్నట్టుంటుంది ఆ వుదయం. అమ్మ నన్ను వొదిలిపోయినద నే విచారచారభారం నా హృదయంలో, ఏడుస్తో గడ్డిలో

పడుకుంటే ఒక చిన్న నీలపు పువ్వు నా చెంపకింద గిలగిలలాడి పిలిచింది నన్ను పిచ్చిమొహంతో. తలెత్తి అది నన్ను చూసేప్పటికి నా విచారమంతా మరిచి పోయినట్టయింది. లోకమంతా యీపూలే తొంగిచూస్తాయి, నవ్వుతాయి, పిలుస్తాయి. దాగుడుమూత లాడుతాయి......నవ్వుతున్నావు......

మళ్లీ నేనుమాత్రం తన కలలన్నీ, ధ్యాసలూ, వెర్రి ఆలోచనలూ అన్నీ వినాలి.

శశాంకుడు.

(నవ్వుతో) నీకారోపం కలిగించాలనే నేనట్లా అంటాను.

అనూరాధ.

పో

శశాంకుడు

(Serious గా) నమ్మవా యీ ఆకాశమూ, కాంతివలెనే నిర్వ్యాజకరుణతో యీశ్వరుడు ప్రసాదించిన వరాల్లో కల్లా అమూల్యమైనది నీ నవ్వు. అదే యీ వెలుతురికి మెరుగూ, పువ్వులకు మృదుత్వమూ, గాలికి శీతలత్వమూ......

అనూరాధ.

చాల్లే వూరుకో,

శశాంకుడు.

నమ్మవా ?

(ఆమె ముఖాన్ని పట్టుకుని దగ్గరగా తీసుకున్నాడు. ఆమె మెల్లిగా తప్పించుకోవాలని చూస్తోంది)

అనూరాధ.

ఎందుకు శశీ, ఇట్లాంటి స్నేహం ఎంతో ఆనందంగా లేదూ? ఎందుకు యింకా నన్ను అసంతృప్తితో బాధిస్తావు?

శశాంకుడు.

బాధా! బాధిస్తున్నానా?

అనూరాధ.

కాదు, బాధించడమంటే...నువ్వు బాధపడుతున్నావని.

శశాంకుడు.

యింక ఎన్నటికీ స్నేహము నిన్ను బాధించదు.

(వెళ్లిపోతున్నాడు)

అనూరాధ.

శశీ నామాట నీకు అర్థంకాలేదు? నువ్వుకూడా నా మీద కోపగిస్తే (గద్గదందుఃఖంతో వొణుకుతో నుంచుని వుంది.)

(బృహస్పతి వొచ్చాడు.)

బృహస్పతి.

రాధా!

(దుఃఖం దాచేసి నమ్రతగా మార్చాలని ప్రయత్ని స్తోంది)

విచారమా! ఎందుకు? తల్లీ నిన్నర్థంచేసుకుని నీ మన సుతో బంధుత్వం కలుపుకునే తీరికే లేకపోయింది. దేహాలు ఒక్కచోటనే నివసిస్తాయి. కాని ఆత్మలు వేరే లోకాలు సంచరిస్తాయి. నాతో చెప్పు. ఎందుకు హిమాలయసరోవరములవలె ఆకళ్లెప్పుడూ మేఘాచ్ఛాదితములై వుంటాయి?

అనూరాధ.

శశీ (ఆగింది)

బృహస్పతి.

శశాంకుడు— ఏమిటి? భయంలేదు. నేనర్థంచేసుకుంటాను.

అనూరాధ.

శశి...వొద్దు. మీకర్థం కాదు.

బ

శశాంకుడు నిన్ను నిర్లక్ష్యంచేసి తార...(తన మాటలకి ఆశ్చర్యపడి తనే వూరుకున్నాడు. అనూరాధ ఆశ్చర్యంతో తలెత్తి చూస్తోంది.) శశాంకుడా కారణం? (శశాంకుడు వొచ్చాడు. బృహస్పతి మొహంలోకి కోపం వొచ్చింది.)

శశీ! (శశాంకుడు వొణికిపోయినాడు. ఆయన ముఖం చూడలేక తలవొంచుకుని కళ్లంబడి నీళ్లు పెట్టుకున్నాడు. బృహస్పతి దయతో శశాంకుణ్ణి కావిలించుకున్నాడు.

వొదిలి ఒక నిముషం మాటలేకండ నుంచున్నారు. బృహస్పతి చాలాతీవ్రమైన ఆత్మపరీక్ష కనుపరుస్తున్నాడు. నిశ్చయానికి వొచ్చి మాట్లాడుతున్నాడు.)

బృహస్పతి.

నాహృదయంలో వ్యాధి అంకురించింది. నూతన సాధన అవసరం. యీ ఆశ్రమంలో ప్రస్తుతం నా సన్నిధి విష ప్రాయమవుతుంది. నేను ఏకాంతసాధనకు వెడుతున్నాను.

(కొంచెం నడిచాడు)

(తనలో) సంసారబంధం ఎంత తీవ్రమయింది? పరిత్యాసమయం వొచ్చేప్పటికి జన్మమంతా చేసిన తపోసాధన, మనోశక్తి వ్యర్థమైనాయి. సర్వప్రపంచాలనూ, మంత్రాలనూ, యోగాలనూ సాధించగలం గాని, యీ మనోహంకారాన్ని, నా స్వంతమనే భావాన్ని జయించడం యీశ్వరుడి తరంకాదు. కాని నేను సాధించి తీరుతాను.

(తిరిగి వొచ్చాడు)

(పైకి) శశీ, నా ఆగ్రహాన్ని మొదటిసారి చూశావు. అదే చివరసారి. ఆగ్రహం దౌర్బల్యసూచకం. జయించి కాని తిరిగిరాను. ఆగ్రహపడడ మెంతదుర్బలమో ఆగ్రహానికి భయపడడం అంతకన్న దుర్బలము. ఎవరి ఆగ్రహానికే జంకకు, నా ఆగ్రహాని కైనా సరే. (తనలో) మరణవేదనతో ఆత్మ నలిగి, తపించి, భస్మమైతే కాని దురభిమానపిశాచంవొదలదు (పైకి) వెడుతున్నాను. నేను

వచ్చేవరకూ నిన్ను వుపదేశంపొందిన ఆ[త్రేయ]ఋరిని నిశ్చలుడవై జపించు. దాని విశాల భావముపైన బుద్ధి కేంద్రీకరింపచేసి స్వాధీనపరుచుకో. ఫలితము నీకే అనుభవ వేద్యము కాగలదు...వసిష్ఠుడువస్తే మాట్లాడిపంపు. (వెళ్లిపోయినాడు. శశాంకుడు అదిరిపోయి నుంచున్నాడు.)

అనూరాధ.

గంభీరముఖంపైన గంభీర తరచ్ఛాయలు కమ్మాయి. నేత్రాలింకా ఎక్కువ అంతర్ముఖములైనాయి. ఏ అధ్యాత్మిక ప్రపంచాన్ని వెతుకుతున్నాయో! ఆ కళ్లవంక చూస్తే ఎంతభయమని! 'నా నిర్దేశాను సారముగా సాధనచేశావా శశీ' అనేగురువాక్కు వినేప్పటికల్లా రంభోర్వశీశీలాన్వేషణంచేసే సాహసంకూడా గిలగిలలాడుతుంది ......ఎందుకో యీ ఏకాంతవాసం? ఆయన వీపు వెనక వ్యర్థస్వప్న కల్పితోన్మత్తుడనీ, అహంభావకర్కశుడని, దూషించే యీ పురుషులు వీలైనంతవరకు యీ ఆశ్రమాన్నివొదలి తిరుగుతారు.......ఆయన్ని యెదుర్కొన్నారు. పిల్లలవలె వొదిగి, దొంగసమస్కారాలు చేసి వెర్రిచూపులతో ఆయన వాక్కులనంగీకరించి నడుస్తారు.

(తారవొచ్చింది.)

అమ్మా, అన్నగారు మళ్లీ యెప్పుడొస్తారు.

తార.

యెక్కడికి వెళ్లారు?

అనూరాధ.

యిప్పుడేకదా వెళ్లింది! మీకు తెలీదా?

శశాంకుడు.

మీతో చెప్పనేలేదా?

తార.

యెక్కడికి వెళ్లారు?

శశాంకుడు.

సాధనకన్నారు.

(తార ఆలోచిస్తోంది. ముందుభయపడ్డముఖం క్రమంగా నిశ్చయంలోకి మారింది. నిశ్చయించుకోగానే ప్రేమతో శశాంకుడివంక జూసింది. తరవాత విసుకుతో అనూరాధ వంక జూసి అణుచుకుంది.)

తార.

(అనూరాధతో) ధేనువు అరుస్తోంది. వత్సాన్ని విడువు.
(అనూరాధ వెళ్లింది. మాట్లాకండా తారా శశాంకుడూ ఎదురుగా నుంచున్నారు. యిద్దరిముఖాల్లోనూ అసహజమైన కలవరం కనపడుతోంది. తార ఏమిమాట్లాడాలో యెట్లా మొదలుపెట్టాలో తెలీయక ఆలోచిస్తోంది. చీకటవుతోంది. దూడ అరుపు ఒక్కటే. గాలి చేసే నీళ్లమీది గలగలా మాత్రమే వినపడుతున్నాయి.)
(నిదానంగా మధ్యమధ్య ఆగుతో) వింటున్నావా ఆ ధేనువు అరుపును? విన్నప్పుడల్లా ఆ అరుపు నా జీవనపు

శూన్యత్వాన్ని వ్యర్థత్వాన్ని తోపిస్తుంది నాకు. బ్రహ్మ సభలో సర్వమునిపత్నులలో పతివ్రతలలో అగ్రస్థానాన్ని నే నంగీకరించి నప్పుడు, సర్వరుషి దేవగంధర్వాలంకృతాస్థానంలో నేను ప్రవేశించగానే, వివస్త్రలై నాట్యముచేసే మేనకాది అప్సరసలనించి అన్ని నేత్రాల్ని నావైపు కాకర్షించి, చీరకొంగు వెనక యీడుస్తో నడిచి నా సౌందర్య ప్రతిభాలాభాన్ని అనుభవించినప్పుడు, గురువుగారు కల్పించగల అధ్యాత్మిక పథాలపైన ఆ శాంత విశాలత్వాన్ని, అనంతకాల గంభీరత్వాన్ని, అందుకో గలిగినప్పుడు, యెప్పుడూ చల్లారని, నన్ను విడవని శూన్యత్వంతో "వ్యర్థము, వ్యర్థము" అనేభావంతో నిరంతర వ్యథాదహ్యమాన హృదయనై భంగపడతాను. శశీ, సంపూర్ణంగా సర్వనైతిక, గౌరవస్వార్థబంధనాలనూ త్యజించి, తెంచి, ప్రేమించండి, స్త్రీజీవితంఅసంపూర్ణంఅర్థవిహీనము. ఈ నిరంతర ప్రమోద లీలాపరంపరలకి ఫలితమేమిటి? అంతమేమిటి? ...చూడు యీ అగాధజలాంధకార తరంగాల మీద తేలివొచ్చే నీలచ్ఛాయలు యీ శీతలవాయు సంచలనములో కలిసితాకే యీ మృధుశాంత కీటకరవాలు యీ నిశ్శబ్ద నిబిడప్రశాంతిలో వూగే జలజపత్ర సుగంధాలు, యీ సర్వమూ నిర్నిద్రనిశ్వాసరహితనిరీక్షణావస్థలో నియమితాలై వేచివున్నాయి. ప్రేమ జంఝూప్రళయా నిలయంకోసం. శశీ నాహృదయ ప్రసూనమూ అంతే......

## అంకం ౫

(శుక్రవారం. శుద్ధ చతుర్దశి, తెల్లారకట్ట నాలుగుగంటలు. ఆశ్రమం దక్షిణదిక్కున సంపెంగపొదవెనక, చంద్రుడు అస్తమిస్తో పొడుగైన నల్లనినీడల్ని కలగచేస్తున్నాడు. గాలి మేలుకుంది. పారిజాతపువ్వుల పరిమళం. కోవెలకూస్తోంది. తార బుజాన్ని ఆనుకుని శశాంకుడు కళ్లుమూసుకుని కూచుని వున్నాడు.)

తార.

యేం రాత్రి యిది శశీ! వెయ్యేళ్లు తపస్సుచేసి, దేవతల ఆశీర్వచనాలుపొంది తెచ్చుకొన్న శంకరుడితో, ప్రథమ సమాగమమైనా యిట్లా అనుభవించి ఉంటుందా పార్వతి!......యేం రాత్రి, యేం రాత్రి! ఒక్కొక్క నిమిషాన్ని ఆపి దీర్ఘంచేసి, యెంతవరకు వీలో అంతా, ఒక్క సహస్రాంశము వృథాకానీక అనుభవించా లనిపించింది. నభోంతరాళాన్ని కప్పిన మన పరస్పరవాంఛని తృణీకరించినదానివలె, నిర్లక్ష్యంగా తిరిగిపొయ్యే రాశిచక్రాన్నెట్లా ఆపగలననే నిరాశనన్ను వేధించింది. మాట్లాడితే తలయెత్తితే, యింకో ఆలోచనరానిస్తే, వూపిరి పీలిస్తే పాపమనుకున్నాను......అడ్డపడే మన గాఢహృదయానుభావాలకందక నవ్వుతో రెక్కలు కట్టుకుని పారిపోతున్నాయి, యీ నిమిషాలు, ఆనందమింత అశ్వరమా! ఎంత ఉన్నతమైనదే, మధురమైనదే, తీవ్రమైనదే, యింతే! యిట్లాజారిపోవలసిందేనా, కొంచమైనా మిగలక! మన ప్రేమమకరందాన్ని మోసుకుంటో బరువెక్కి

పోలేక పోలేక వెనుతిరిగిచూస్తే పాద్యోగడియలు తరిగి రావు కదా, యెన్ని పుణ్యాలుచేసినా, యెన్ని కన్నీళ్లుకార్చినా, యెంత తపోసాధనచేసినా?......యిందాకా ఆ నిమిషం జ్ఞాపకం తెచ్చుకో......దేన్నో పాపం నక్క గావును పట్టుకుంది, ఆగడ్డివెనుక. మిణుగురు పురుగు నీ జుట్టులోనించి యిట్లా ఎగిరి పోయింది. నా కోసంచూస్తే సన్నగా నాజూకుగా, యీ తెల్లని ఆకాశంకింద మెరుపు మల్లీ వెలుగుతో పడుకున్నావు. కొమ్మలకిందినించి, తలవొంచి, వున్నావో లేదో అని నిన్నుచూసి, నిన్ను, నామల్లెపువ్వుని, నిప్పువంటి నాకోర్కెతో, మండేనా హృదయజ్యోతిమీద మాడ్చేస్తానేమోనని భయమేసింది. కాని నువ్వా నలిగేవాడివి. ఆ చాతుర్యమూ, కళా, చిన్ని చిన్ని మోహనచర్యలూ, యెక్కడ నేర్చుకున్నావు అప్పుడే శశీ? క్షణక్షణమూ నా కళ్లముందు, నావొళ్లో యెదిగిన నీకు యీసంగతు లెవరు బోధించగలిగారు? ఎందుకుపైగా సిగ్గు!......యింకా, యింకా యెట్లా మండించేస్తోందని నీమీది వాంఛ!...యెప్పుడో నిన్ను వూపిరాడకండా, నలిపి, నా వొళ్లు తెలీక చంపేస్తానేమోనని భయంవేస్తోంది...నిరుపమానమైన నీ సౌందర్యం తప్ప యీ హృదయ దుర్గాన్ని యింకేదన్నా వశపరుచుకోగలుగునా?

నన్ను గానక, నన్నుకోరి, దగ్గిరికి వొచ్చేవిధం తెలీక, ప్రియుడివైవొస్తే, పాతివ్రత్యాంధనై, తిరస్కరిస్తానని

భయపడి, దొంగవలె, వామనమూర్తినై, నా వొళ్లోచేరి, యెదిగి, సర్వమూ యిట్లా ఆక్రమించుకున్నావా?

శశాంకుడు.

ఇట్లా పడుకోనీండి. చల్లగా గాలివేస్తొంది, తనుకూడా యీ అనందాన్ని పంచుకోడానికి ప్రయత్నిస్తున్నట్టు. రాత్రంతా లావణ్యసముద్రంలో యీది, తెల్లని, మెత్తని, యిసుకమీద నిద్రలో మునిగి పోతున్నట్టుగా వుంది...... మీ చూపు నా చెంపలమీద కాలుతోంది. ఇంకా యేం హోమంచెయ్యాలి యీ మహాజ్యోతిలో? ...... అబ్బా! యీ సౌందర్యం! వేళ్లక్రింద యిమిడి నట్టే యిమిడి పెదెమలకింద కరిగినట్టే కరిగి, తప్పించు కొని, అక్కడే మళ్లీ ఆకర్షిస్తో కనపడె, నా అసహాయ త్వాన్ని, నిరాశని, వ్యథనిచూసి వెక్కిరించినట్టు నవ్వు తోంది. ఎట్లా? ఏంచెయ్యను? (నిరాశపడ్డట్టు ఆగాడు.) చూడండి. మనం చిక్కనైన వెన్నెల్ని పేలుస్తున్నట్టుగా వుంది. మన కంఠరవాలు ఆ చీకట్లో నిద్రపోతున్న నిశ బ్దాల్ని మేల్కొలుపుతున్నాయి. మీరూ, నేనూ, తప్ప, తక్కిన ప్రపంచం యీ వెన్నెలలో కరిగి మాయమైన ట్టుంది.

(ఆగి, ఆదేశంతో) శరీరంకాదిది. సౌందర్యం కాదిది. సృష్టికర్త సహాస్రయుగాలు తపస్సుచేసి, కల్పించుకున్న లావణ్యస్వప్నాల ఫలమిది. ఆది రాక్షసుడి తపోభంగా నికై దేవతలు కావించిన మహాకర్షణ. గత ప్రళయనాశ

నంలో లీనంచేయ చేతుల్లురాక ఏకాదశరుద్రులు వొదిలిన మిద్యుద్దీప్తి యిది.

తార.

యింకేం నిద్ర. లే, చూడు. వెన్నెల తెలుపులో వుదయారుణకాంతి కలిసిపోతోంది. పారిజాతం తెల్లగాపూసి మధుపాలను పిలుస్తోంది దగ్గిరకి. (శిష్యుల వేదగానం వినపడుతోంది. శశాంకుడు కళ్లు తెరచి లేచికూచున్నాడు. మోహంనించి భయంలోకి మారింది అతని మొహం. నాలుగు నిమషాలయింది.)

శశాంకుడు.

కొత్తరోజు. ఏంచెయ్యను యీ లోకంలో? ఈకాంతి నా కళ్లమీద పడకుండా మీ నీలకుంతలాలని కప్పి నిరంతరాంధకారం కల్పించలేరూ? ... రాత్రి ... యెవరూ లేపట్టేవుంది... నేను వెళ్లవొద్దూ!... అదిగో ధవళజ్యోతి తూర్పున. ఇంకా స్నానం కాలేదు. స్వర్ణ. తల్లి స్వర్ణ నదిలో...నా శరీరాన్ని... యీగంధం...దేన్ని కడగనా...యేమి?

తార.

శశీ నువ్వు...

శశాంకుడు.

కొంచంవుండండి. యింకా వేదపాఠంవల్లించాలి. వెడతాను. (లేవబోయి కూలబడ్డాడు.)

తార.

నాయనా శశీ యిట్లా పడుకో.

శశాంకుడు.

యింకానా! వృష పవిత్ర శ్వేతాంబరధర పరమపావన సంధ్యా సమయమయింది. నేను వెళ్లాలి. చూడండి కృత్తిక కనపట్టంలేదు....యెక్కడికి వెళ్లను లేచి?

తార.

శశీ! యేమిటిది? నీ కేం భయం? ఆశ్రమంలోకి రా. పడుకుందువుగాని.

శశాంకుడు.

ఆకాశపు నలుపును కడిగిన యీ శుభవుదయ తేజస్సు నా మాలిన్యాన్ని కడుగుతుందా?

తార.

యెందుకట్లా కుంగిపోతావు? సర్వసుఖాలూ నశించిన వానివలె ఏదో దుస్వప్నంలో భాధపడుతున్నావు. కళ్లు నులుముకుని — చిన్నప్పుడు గుప్పెట్లతో నిద్ర లేవగానే కళ్లు తుడుచుకునేవాడివే—అట్లా ఒక్కసారి కళ్లు తెరచి నన్నూ, యీ లోకాన్ని చూడు. ఈ మహానందంలో మన ప్రణయ మాధుర్యంలో ప్రపంచం వెలుగుతోంది. యీ వుదయం సూర్యుడికి కొత్తకాంతి కలిగినట్లు కనపట్టంలేదూ? మబ్బుల్లోంచి వొచ్చె యీ శుభ తేజస్సులో నీ మొహం యెట్లా ఆకర్షకంగావుందని! ... సాఫల్యం

కాలేదూ నీ జీవితం నా ప్రేమలో ? మండే కోర్కెతో భస్మమైపోలేదూ నీ సందేహాలు ? ... నవ్వు నేననే గానంతో సృష్టిప్రయ్యాల లూగుతోంది. కాలమానంద నృత్యం మొదలుపెట్టింది. బ్రతుకు నూతనోత్సాహంతో అనుభవంతో నిండిపోయింది. ఈనాటినుంచి నాపాదాలు భూమిని తాకినప్పుడల్లా దివ్యవీణారవాలు ధ్వనిస్తాయి. నాచెరుగు గాలిలో చెదిరినప్పుడల్లా నూత్నపల్లవసూన వితానాలు వికసిస్తాయి. నాకళ్లలోంచి ఉద్భవించే ఆనంద ప్రవాహాలు యీ లోకంలో నిజతత్వాన్ని దారిద్రాన్ని కడిగి నూతనజీవాన్ని ప్రతిష్టిస్తాయి...శశీ నన్ను నమ్ము నీ కేమీ భయం వొద్దు. నా జుట్టుని కప్పి, నా హృదయంలో దాచి, నిన్ను రక్షించుకుంటాను. తార శక్తి హీనురాలైన సామాన్య స్త్రీ అని తలచకు. ఎంతకాలమైన నిన్నూ నన్నూ ఏ జగధీశులూ, పరమేశులూ వేరుపరచలేరు. నా జీవనోద్రేకాన్ని ప్రణయ పాత్రలో పోసి నీకు నిరంతరమూ మోహతృష్ణాపరిశాంతిని కలిగిస్తాను. నా నేత్ర తీక్ష్ణదృష్టులతో రేపిన తీవ్రదుర్భర ప్రణయానిలాన్ని నా మృదుశీతలస్నిగ్ధ వక్షంమీద చల్లారుస్తాను ... నా చిన్న శశీ, పిచ్చి శశీ నీ అసహాయత్వం చూచి నా మాతృహృదయంకరిగి నీమీద వాలుతోంది.

శశాంకుడు.

ఆ కాంతి చూడండి. యెర్రగా ... గురువుగారికి కష్టం కలిగి కోపస్ఫూర్తి కళ్లలోంచి వెదజిమ్ముతారని భయ

పడే సమయంలో అట్లానే ఆ నల్లమబ్బు వెనకనుంచి ఆకాశాన్నంతా పావనంచేస్తోవొచ్చే ఆ భగీరథీ ప్రవాహతుల్యమైన ఆ నిర్మలస్వేత కాంతివలె కనుబొమ్మల కిందినించి, శిష్యహృదయ తమోభంజకమైన దయాకాంతులు కనపడతాయే! అట్లా వుందికదూ?

తార.

(శశీ—అని దయతో పిలిచి)—

నన్ను తారా! గట్టిగా, యింకాదగ్గరగా అన్ననీ దీనమైన కొత్త అరుపు విని పర్వతాలు, వృక్షాలు, గాలి చప్పుడు కాకుండా చూశాయి. మన ఆవేశాలలో వేడి నిశ్వాసాలతో మండుతున్న ఆ నిశ్శబ్దం ఆ నిముషంలో బద్ధలై సహస్రకంఠాలతో "తార" చుక్కనించి చుక్కకి, దిక్కునించి దిక్కుకి ప్రతిధ్వనించింది. దిక్పాలకులు, రతీదేవి, అరుంధతి "ఓహో తారా" అన్నారు

శశాంకుడు.

శిష్యుడు గురుపత్నిని 'తారా' అన్నసాహసపు రవాన్ని విని ప్రపంచమే భీతితో ఆగింది. ఎంత వికృతము. అధర్మము అని విభ్రాంతులై విమానాల్ని ఆపారు గంధర్వులు. సిగ్గుతో ఆకాశం కళ్లుమూసుకుంది.

తార.

అట్లా తోసెయ్యకు. అల్లరిపిల్లవాడువలె యెందుకు మూర్ఖంగా చూస్తో, చూస్తో, తన్నేస్తావు నిరంతర నిత్యమోహ జీవనాన్ని కల్పించే అమృతకలశాన్ని! ...

నా చెయ్యిజారిస్తినా ఆ సూర్యుడు రథాన్ని నిలిపి, దిగి వొస్తాడు నాకోసం.

శశాంకుడు.

మీా చూపుల అగ్నిలో మీా చేతుల తాపంతో కంది పోతున్నాను. వొద్దు. నన్ను వెళ్లనీండి.

(తార చివాలునలేచి రోషంతో శశాంకుడివంక చూస్తో వెళ్లిపో యింది. శశాంకుడు ఒక్క నిమిషంకూచుని ఉన్నాడు. లోపల్నుంచి అనూరాధ ప్రాతఃకాలగీతం వినపడుతోంది. రెండునిమిషాల్లో, స్నానంచేసి తడిగా వేళ్లాడుతున్నజుట్టుతో, నుదుటిమీాదనుంచి తలమీాద పెట్టుకున్న కొత్త చామంతి, సూర్యకాంత చంపక పుష్పాలతో, తెల్లని బట్టలతో అనూరాధ పాడుతో వొచ్చింది.)

శశాంకుడు.

నన్ను పావనాత్ముణ్ణి చెయ్యవొచ్చిన సావిత్రీదేవివా ?

అనూరాధ.

ఇక్కడున్నావేం ? స్నానమన్నా కాలేదే !

శశాంకుడు.

అనూ ; నువ్వు ఎవరో కిన్నెరకన్నెవి. యిప్పుడే స్వర్గంలో ఉద్భవించి లోకాన్ని నీమధురగీతాలతో పుణ్యకార్యాలకి పురిగొల్ప నడిచివొచ్చావుకదూ? యిక్కడవున్న పువ్వులన్నీ తెచ్చి నీకు పూజచెయ్యాలని పిస్తోంది.

అనూరాధ.

ఏమిటిశశీ యిట్లాఅయినావు ? ...... నే నేంచెయ్యాను నీకునూతనోత్సాహం యివ్వడానికి ?

శశాంకుడు.

పూజించనీ, నీకళ్లలోకిచూస్తేనే నాకెంత బాధగావుందే ...... నేనింకవుండను, అనూ. వెళ్లిపోతున్నాను, యీ ఆశ్రమాన్ని, నా లేడిని నిన్ను అందరినీ వొదిలివెళ్లిపోతున్నాను.

అనూరాధ.

వెళ్లిపోతావ్రా? వెళ్లిపోవడమేమిటి? నీకీఅవస్థ ఏమిటో ఎందుకుపట్టిందో, నాకర్థం కావటంలేదు. నీకళ్లల్లో వుండే పల్లనిభీతికి కారణం తెలిటంలేదు. చెప్పవ్రా? నా వల్లనే! నా పాటలు నిన్ను కలవరపెట్టి నీచేత యిష్టంలేని పనులుచేయించాయా? యింకెప్పుడూపాడను. నా చనువూ, స్నేహమూ నిన్ను పక్కతోవల కీడ్చాయా? దూరంగానుంచునే నిన్ను చూసి సంతోషిస్తాను. నాక స్నీళ్లూ, రోషమూ, నీస్వేచ్ఛ నాటంకపరచి కాళ్లకు బందాలు కల్పించాయా? చిరునవ్వులతోటే నిన్ను సమీపిస్తాను. పాతాల అక్షరాలతో అలిసిన నీకళ్లు నిద్రతోనిండి మూతలుపడేప్పుడు మాత్రం నీకొక్కసారి కనపడి 'నా అవసరముందా?' అని అడిగి వెళ్లిపోతాను.

శశాంకుడు.

ఏం చెప్పను. నీకర్థంకాదు, నారాధవి, ఆప్సరాలివి, నీకై నాస రే

అనూరాధ.

భయంలేదు. అర్థంచేసుకోగలను.

శశాంకుడు.

(మొహంతిప్పేసి) యీనీ పవిత్రదృష్టులముందునామలిన చరిత్రను యెట్లావిప్పను? నేనిక్కడ నిలవలేను. వెడుతు న్నాను.

అనూరాధ.

ఈ ఎఱ్ఱని యెడ తెగని మైదానంమీద ఎండ ఎట్లా మెరు స్తోందో! దాహంపడ్డ లేడివలె, గాయంపడ్డ డేగవలె, యెగిరి పోతావా వేగంగా? వేళ్లేవాడివి యిక్కడివాళ్లను యెం దుకు ప్రేమబంధనాలతో కట్టుకున్నావు? ఆ రోజులు జ్ఞా పకం తెచ్చుకో, మధ్యాహ్నమయింది. యెండుటాకులతో చెట్లకింద బంతులాడుతున్నాడు వాయువు. నీడల్నికూడా మాడుస్తోంది తీక్ష్ణజ్యోతి, నీ అల్లరిచేతికికూడా భయప డలేని స్థితిలో గోరువంకలు నోళ్లు తెరుచుకుని ఆశ్రమా న్నాశ్రయించాయి. నువ్వు ఆవలిస్తో పుస్తకం ముందుపె ట్టుకుని అమ్మగారు భోజనానికి యెప్పుడు పిలుస్తుందా అని తొంగి తొంగిచూస్తో కూచున్నావు. నా అడుగుల చప్పు డువిని తిరిగిచూసి నీలాలవంటి కళ్లతో వినోదంగా యెం దుకొచ్చావు అన్నావు ఆశ్రమమంతా నీసొమ్మైనట్లు? (శశాంకుడు కొంచంగా నవ్వుతున్నాడు) తరవాత మూ డురోజుల్లో పనిమపానచూసినా రాధేశావలసివొచ్చింది. గాధ కనపడకపోతే పాఠాలు సాగవు. రాధ లేకపోతే జీవితం జీవితంలాగుండదు. రాధనవ్వు వినపడకపోతే ఆట లమీద బుద్ధిపోదు. యింత సుందరానుభవమూ ఒక్క

నిమిషంలో నశిస్తుందా? నువ్వు వొదిలించుకు పోవాలనుకున్నా సరే......యిట్లా క్రూరంగా స్నేహలత తెంపేసుకు పోయ్యేవాడివి, అనుని, నీకళ్లలో యెందుకు కలిపేసుకున్నావు?......నన్ను చూడకముందే నా అడుగుల చప్పుడు విని నీహృదయస్పందనానికి తాళమేస్తో, సగం దూరంలోనే వొంపుతిరిగి నన్ను కలుసుకోవొచ్చేవి నీ అల్లరిచూపులు నాకు తెలీదూ?......నువ్వు వెళ్లిపోతే నేనేం చెయ్యానిక్కడ? నేనెట్లా జీవించను? వెళ్లనీను, యిట్లా చెయ్యిపట్టుకుంటే యెట్లా వెడతావో వెళ్లు, నిన్ను తాళ్లతో కట్టేస్తే తెంపుకు వెళ్లగలవు. పాటలతో కట్టిస్తే వెళ్లగలవా? గదిలో తాళంవేస్తే దూకిపోతావు. హృదయంలో తాళంవేస్తే!

శశాంకుడు.

ఎందుకు అనూ, నా మీద నీకు యింత దయ? ... యెంత తెల్లగా నిర్మలంగా, చల్లగా, సన్నగా తీగెవలె వూగుతో అల్లుకుంటో, పెనవేసుకుంటో, యెంతమధురంగా వున్నావో, యెట్లా మరచిపోయినాను నిన్ను?

అనూరాధ.

వెళ్లడం మరచిపోయినావా మరి?

శశాంకుడు.

యెట్లా మరిచిపోను? మరిచిపోగలిగితే నిన్ను చూసిన కొద్దీ నా కళంకం వ్యక్తమవుతోంది. సూర్యకాంతి

పడ్డకొద్దీ ఛాయలు చిక్కనైనట్లు నిర్మలమూర్తివి నువ్వు నన్ను తాకకు, నీ హృదయ విశ్వాసాన్ని కఠినంగా మోసంచేశాను. నీ కళ్లచూపు భరించలేను అనూ! నన్ను మరచిపో. నీ చిన్న నిర్మల దరహాస చంద్రికారేఖ కొక్కదానికి అర్హుణ్ణయ్యేందుకు—

అనూరాధ.

షోడశ కళాపరిపూర్ణుడవు క్షుద్రస్మేర రేఖ ఎందుకోయి?

శశాంకుడు.

అనూ, నే నీ దయను సహించలేను. జాలిపడి నన్ను కృపణున్నిగా తలచి పవిత్రమైన నీ మనోక్షేత్రంలో ఒక్క మూల యీ నిర్భాగ్యుడికి స్థానముంచి ధన్యుణ్ణి చెయ్యి.

అనూరాధ.

(శశాంకుడి చెయ్యి పట్టుకుని) శశీ వెళ్లకు. గాయపడ్డ నీ హృదయానికి పరిశాంతిని కలిగించనియ్యి నన్ను బాధ పడే సమయాల్లో శీతలమృదు సంస్పర్శచేతనూ తన విశ్వాసాన్ని కల్పించ లేని స్నేహమేపాటిది శశీ...

(అనూరాధ మాట్లాడుతో ఉండగానే విననివాడినలె శశాంకుడు వెడుతున్నాడు.)

వినవా?...సరేలే.

(శశాంకుడు వెళ్లాడు, అనూరాధ కంటోంచి ఒక్క నీటి చుక్కజారిందే.)

# అంకం ౬

(శనివారం. శుద్ధపౌర్ణమి. సాయంత్రం ఏడుగంటలు. పగలంతా వానకురిసింది. ఈగురుగాలి కొడుతోంది. అప్పుడప్పుడు పరిగత్తే మబ్బులనించి వురుములు వినపడుతున్నాయి. మబ్బుసందుల్లోంచి చంద్రుడు కనపడుతున్నాడు. అప్పుడప్పుడు వుండుండి చినుకులు పడుతున్నాయి. మూడో రంగస్థలం. తార మామిడిసీడకి యివతలగా వెలుగులో నిరీక్షణా దృష్టితో నుంచునివుంది. బృహస్పతి దూర ప్రయాణాన్నించివలె వెనకనించివొచ్చాడు. ఆయన్ని తిరిగి చూసి తార కొంచం కలవరపడ్డది.)

బృహస్పతి.

(దయతో) నాతో అంత తీవ్రమైన అవసరమేమికలిగింది? నా సహాయం కొరకైన నీవాంఛాగాఢత్వం నా యోగ నిద్రను కలవర పరిచింది.

తార.

(తత్తరపాటుతో) అవసరమా? ...... అవును ...... మీకు తెలీగానే ...... నా కొరకై ...... యింత దూరం ...... వెంటనే ...... తపోభంగమైనా... వొచ్చేశారా?............నాకోసం! ...

బృహస్పతి.

తారా! ఎందుకు సందేహిస్తావు నా ప్రేమను? అవసరమేమిటి చెప్పు.

తార.

(సిగ్గుతో, భయంతో) నా పిలుపును గుర్తించిన మీ

యోగదృష్టి నా అవసరాన్ని అర్థం చేసుకోలేదా ... నూతన నానుభవగ్రస్తను సంశయాకులచిత్తనూ నన్నొంటె విడిచి ...

బృహస్పతి.

సంశయాకులచిత్తుడనూ, దుర్బలుడనూ, స్వార్థ దురభిమాన పీడితుడనూ కావడంచాతనే, నిన్ను వొదిలి ... ఈ నూతన సంసార పరీక్షలో నా సర్వ నిగ్రహ శక్తులూ నశించినట్టు తోచి ...... నాకోసంకాదు ...... నీవు యీ దారుణ అనురాగసమస్యలో నలిగి, దుర్బలవై, నా సహాయంకొరకు చేతులు జాచినప్పుడు, నేనూ, వ్యర్థుడనూ, శూన్యుడనూ; కాపీన, యీర్ష్య, ఆగ్రహ పిశాచగ్రస్తుడనై, న్యాయ, ధర్మ, ఉదార, శాంత, ఆదర్శవిదూరుడనై, అక్రమంగా నీ నీతిపాలనాధికారాన్ని పూని ఇద్దరి జీవితాలను యెక్కడ భగ్నం చేస్తానో అని భయపడి, నూతన తపోశక్తికై వెళ్ళిపోయినాను. (తార తలమీద చెయ్యివేసి) తారా, నా తారా! ఎంత నలిగిపోయినావమ్మా! నన్ను సంశయిస్తావా? నీకోసం ఏ త్యాగానికైనా, జంకను. తారా! నా ప్రేమను సంశయించకు. నీ హృదయాన్ని తెరిచిసమస్తమూ నాకు తెలియచెయ్యి.

తార.

శశాంకుడు ఆశ్రమాన్నించి వెళ్లి పోయినాడు. అతన్ని మీరు నాకనుగ్రహించాలి.

బృహస్పతి.

నేనా !

తార.

ఆర్యా ! మీ హృదయం చీలుస్తున్నానా ?...... శశాం కుడు మీ భయంతో వెళ్లాడు. మీరు వెళ్లి అభయమిచ్చి పిలిస్తేనేకాని రాడు.

బృహస్పతి.

నా భయమా ?

తార.

మీ కారుణ్య భీతి.

బృహస్పతి.

(ఆలోచించి) తారా, నువ్వాతనిదగ్గిరికి వెళ్లరాదా ?

తార.

(దుఃఖంతో) మీరు ...... మీరుకూడా ...... సామాన్య మానవులవలె ...... అపరాధం తోచగానే ...... భార్యను పొమ్మంటారా ? ... కాదు మీరని కాదు ఆ మాట ...... మీరు ...... మీరు అంతే ...... పొమ్మన్నారా నన్ను. (ఆగి) తమర్నిన్యాయనత చేస్తానని, తమ ఆత్మగౌరవం నొప్పిస్తాననీ, నేననుకో లేదు. మీ కన్న ఆప్తులు లేరని, మీ కన్న గౌరవ ప్రధాను లెవరూ కారని, అంతరాంతర నిగూఢ దౌర్బల్యాన్ని అర్థంచేసుకుని, సానుభూతిని చూపగల జ్ఞానులు, ఉదా రులు మీరని ......

బృహస్పతి.

(బాధతో) తారా! నీప్రవర్తన నా యెడల అపరాధం కాదన లేదూ? ఇది నీ గృహము.

తార.

కాని, ఈ ఆశ్రమంలో, మీలో, మీ భక్తిలో లీనమైన నాకు ప్రపంచంలో యింక వేరేచోట స్థానమెక్కడిది?

బృహస్పతి.

ఆత్మపరీక్ష అవసరం.

తార.

యింతకన్న సాధ్యంకాదు.

బృహస్పతి.

నువ్వతని దగ్గిరికి వెళ్లు. ఏనాటికైనా సరే యీ గృహమూ, నా హృదయమూ నీ ఆగమనంకోసం వేచి వుంటాయి.

తార.

కాని ...... కాని ...... అతని దగ్గిరికా? ఇక్కణ్ణించి? మిమ్మల్ని వొదిలి ...... లోకపుమూర్ఖత్వాన్ని భరించగలనా?

బృహస్పతి.

ధర్మమూ, న్యాయమూ, లోక పరిహాసానికి జంకవు. (తారసిగ్గుతో మాట్లాడదు) నీ స్వభావంలో సహజంగా వున్న, మృదుత్వాన్నీ గంభీరత్వాన్నీ లోకంయడల భీ

రుత్వంతో నాశనం చేసుకుంటావేమో అని భయపడు తున్నాను. ఇన్నాళ్లు నా సహధర్మచారిణివై—అదుగో నా అహంభావం—క్షమించు (ఆలోచనగా) కాని, తారా, నీ భీరుత్వానికి చౌర్యం జతచేసి, నన్ను తెరగా, నీతి వస్త్రం కప్పి నుంచోమంటున్నావు తెలుసునా?

తార.

(కళ్లు కిందికివాల్చి, నెమ్మదిగా, దృఢంగా) ప్రేమకోసం నేనా త్యాగం చేస్తాను. మీ కష్టమూ, బాధా నా కర్థమౌతున్నాయి కాని ఆ తీవ్రత్యాగం చెయ్యగల మహా క్షేత్రంటే ఆ పవిత్ర పాదధూళిని......

బృహస్పతి

వొద్దు తారా! నువ్వు చెప్పిందే ధర్మం. ప్రేమకోరిన త్యాగానికి జంకేవాడు ప్రేమ కనర్హుడు.

తార.

ఈ కృతజ్ఞత నెట్లా భరించను?

బృహస్పతి.

నా ధర్మాన్ని, విధిని, నేను నిర్వర్తించుకుంటున్నాను. కృతజ్ఞతాప్రసక్తి అనవసరం. నా అంతరాత్మమాత్రం నీ ప్రవర్తనతో సానుభూతని చూపాలనే ప్రయత్నానికి ఎదురు తిరుగుతోంది. ప్రజల తుచ్ఛ అభిప్రాయాలని లక్ష్యపెట్టేనడత సత్యచోదితముకాదు......ఏం చేసినా తారా, కాంతినించి విముఖవు కావొద్దు. హృదయ

పరీక్ష తేల్చే పర్యవసానాన్ని విశ్వసించి, అంగీకరించి, అనుష్ఠించే ధైర్యాన్ని విడనాడకు. భయమే సమస్తపాపాల్లోకల్లా హీనమైన పాపము. పాపాలన్నిటికీ మూలకారణము. భయపడకు. లోకానికిగాని, పాపానికిగాని, నరకానికిగాని నాకుగాని. ధీరస్వాంతులకు యెంత అధోగతియందైనా రక్షణహస్తము దూరమందుండదు. సాహసవంతులముందు విధిసహితం జంకుతుంది. నేను వెళ్ళి శశాంకుణ్ణి తీసుకు వస్తాను.

(వెడుతున్నాడు. తార ఆలోచించి చప్పున ఆయన్ని వెనక్కి పిలవబోయి, ఆగి, వెళ్ళిపోయింది. గాలి వీచినప్పుడల్లా చెట్లమీదనించి నీళ్లు రాలుతున్నాయి. వెన్నెలవొచ్చింది. ఎర్రని నేలమీద అక్కడక్కడ పల్లాల్లోచేరుకున్న నీళ్లలో వెన్నెలపడుతోంది. వుండుండి చెట్లు వూగుతున్నాయి. అనూరాధ పాడుతో విచారంగా వొచ్చింది. మొక్కల్ని చూసి పాటనాపి వాటిని తాకుతో మాట్లాడుతోంది. అప్పుడప్పుడు మాట్లాడడం ఆపి, ఆలోచనలో పడి మళ్లీ పాడుతోంది.)

అనూరాధ.

మధ్యాన్నమెందుకు మాట్లాడకుండా పడుకున్నావు జాజీ. అంత నాజూకా మరీ! ఆ కాస్త ఎండకే! శశి చూడు. ఎంత ఎండలో వెళ్లిపోయినాడో!

(ఆలోచనలో పడ్డది.)

నగలన్నీ తీసేసి వెళ్లబోయ్యేదానివలె నుంచున్నావు. కదలవేం! చూడు. వాయు వెట్లా నిరాశపొంది నిన్నువొదిలి వెళ్లపోతున్నాడో ఆ కౌముది దగ్గిరికి! నా మీదనే యీ

కోపమంతా! ఎందుకు? పొద్దున్నే వచ్చి నీ శోభ చూడలే దనా? పొద్దున్న శశి వెళ్లిపోయినాడు మరి!

(ఎక్కువ దిగులు పడుతో మాట్లాడుతోంది.)

మళ్లీ మళ్లీ శశి లేడని జ్ఞాపకమొచ్చి బాధపెడుతోంది మనసు (విచారమెక్కువై వెన్నెలవేపు తిరిగి పాడుతోంది) ఏం చెయ్యను? నిద్రైనా రాదు. ఒక్కొక్కటే యీ పిచ్చి మొక్కలు నిద్రపోతున్నాయి. నన్నూ నా దుఃఖాన్నీ యీ వెన్నెలికి వొంటరిగా వొదలి (మళ్లీ వెన్నెల్లో పాడుతో నుంచుంది. విచారభారం ఎక్కువయింది. చప్పున తెల్ల పిచ్చిగా పూసిన కామిని పొదని కావిలించుకుని మొహం ఆ పూలతో అద్దుకుంటో మాట్లాడుతోంది) కామినీ! కామినీ! శశి వెళ్లిపోయినాడు. నాకేంతో స్తుంది! నీకు తెలుసునా వెళ్లిపోయినాడని? యిట్లానే వెళ్లాడు. నిద్రతో అలసటతో మూతలుపడే కళ్లతో; సిగ్గుతో, భయంతో, వేళ్లాడే ముఖంతో; తామరకాడవలె వొడిలిపోయిన శరీరంతో; మీవంక నన్నా కన్నెత్తి చూడక వెళ్లాడు...యింక నేనేం చెయ్యను? నాకేంతోస్తుంది? పొద్దున్నే గోరింట "శశే నాకు నీళ్లు పొయ్యాలంటే" నేనేం చెప్పను? శశి నవ్వు వినపడకండా మీరందరూ బతుకుతారా? మీ ఆకుల్లోంచి కలకలమని పరుగులెత్తే ఆ నవ్వు! యీ ఆశ్రమం శవం లాగు వేళ్లాడుతోందే! యీ వెన్నెల శవంమీది వస్త్రం లాగు పరుచుకుందే!......నువ్వూ నిద్ర పోతున్నావా లేదు. యింకా దగ్గిరిగా కావిలించుకో! ఎందుకు కామినీ

నా మీద యింత దయ ?...... ఊహూ నేనేమీ అనలే
ను.అతన్ని ! కాని అతను లాలించవొస్తే దూరానుంచా
ను...తప్పా ! చూడు నీకొక్కటే పుష్పమనుకో జీవనా
నికంతా ! దాన్నికోసి వాసనచూసి, నలిపి, నీముఖాన్నే
పారేసిపోతే నీకెట్లా ఉంటుంది? శశి నన్నట్లా చేస్తాడని భ
యం. కామినీ నన్ను వొదలకు. ఏమైనా నువ్వు నన్ను ప్రే
మిస్తావు కదూ ? (కామినిని వొదిలి పాడుతోనుంచుంది.)

---

# అంకం ౭

(ఆదివారం బహుళ షష్ఠి, మధ్యాహ్నం మూడుగంటలు. ఆశ్రమం ముందు అరుగుమీద విశ్వామిత్రుడు కూచుని వున్నాడు. దేవేంద్రుడు కిందనుంచుని మాట్లాడుతున్నాడు.)

విశ్వామిత్రుడు.

ఇప్పుడీ బృహస్పతి యెందుకు వెళ్లినట్లు ?

దేవేంద్రుడు.

వెళ్లడమెందుకో ? ఆ శశాంకుడి కోసం ఒక్క శాపంతో తీరిపొయ్యే దానికి ! ఆఖరికి యీయన సంసారంలో కూడ ...

విశ్వామిత్రుడు.

ఆశ్చర్యమే ముంది ? ఇంతటి సాత్వికు డెప్పుడైనాడో అప్పుడే అనుకున్నాం. ఈ ఋషులు పెళ్లి చేసుకోవడమంత తెలివితక్కువ యింకేమీ లేదు ?

దేవేంద్రుడు.

ఏమి ?

విశ్వామిత్రుడు.

భార్యని జాగ్రత్త పరుచుకునే శ్రద్ధవుండదు. తమరు చెప్పే వేదాంతం భక్తిగా వింటున్నట్టు నటించేవాళ్లల్లా మంచివాళ్లు అని నమ్మి యింట్లో చేరుస్తారు. ఐనా ఋషుల ఆధిక్యత తెలుసుకో గలిగిన సంస్కారమున్న భార్యలే లేరు. భౌతికం కాదయ్యేను.

(గౌతముడు వొచ్చాడు.)

నువ్వూ వొచ్చావా ?

(దేవేంద్రునితో) చూశావా యెట్లా బైటికివొస్తాయో యీ సంగతులు. తనకి తప్ప యెవరికీ తెలీదనుకుంటో ఉంటాడీ బృహస్పతి. అతనికంటే లోకానికే యెక్కువ తెలుసును, యిప్పుడు.

గౌతముడు.

పూర్వం యిట్లాంటి అవస్థే నాకు కలిగినప్పుడు తన శిష్యుణ్ణి రక్షించాలని చాలా ప్రయత్నించాడు యీ బృహస్పతి. కాని నా దగ్గిర సాగలేదు. తను ఆనాడు నాకు బోధించిన క్షమా, ఔదార్యమూ, యిప్పుడీ శిష్యుడి విషయమై యేమాత్రం చెపుతాడో చూడాలి. వూరికే అడ్డప్రశ్న లేసి, గొప్ప ఆదర్శాలు మాట్లాడి మనకి వూపిరాడకండా అదరకొట్టడ మనుకున్నాడు గావును. అయింది అయ్యగారి పని.

విశ్వామిత్రుడు.

ఇప్పుడా ఆదర్శాలు మనమే మాట్లాడి ఈయన మాటలు యీ యనకే వొప్పచెప్పి బుద్ధి చెపుదాం బాగా.

గౌతముడు.

బైటకూచున్నారేం ? ఎవరూ లేరూ ?

విశ్వామిత్రుడు.

అతగాడు శశాంకుడి దగ్గిరికి వెళ్లాట్ట.

గౌతముడు.

ఎందుకో? ఈమె గారా?

విశ్వామిత్రుడు.

సుఖంగా తిరుగుతోంది.

గౌతముడు.

ఛీ! ఛీ! ఎంత పాడయిపోయింది లోకం! నీతీ, దుర్నీతీ విచక్షణ లేక పోయింతరవాత ఎందుకంట! మళ్లీ ఋషులంతా వెయ్యేసేళ్లు వొంటికాలి మీద, నిరాహారులమై తపస్సుచేసి యీశ్వరుణ్ణే సాధించిన వాళ్ళం, ప్రపంచానికంతా ఆదర్శంగా ఉండవలసిన వాళ్లం మన కుటుంబాల లోనే యిట్లాంటి అక్రమాలు జరుగుతోవుంటే.

విశ్వామిత్రుడు.

సరేకాని ప్రస్తుత వ్యవహారం నీకేమన్నా అర్థమయిందా?

గౌతముడు.

అంటే?

దేవేంద్రుడు.

గురువుగారు ఆ శశాంకుడి దగ్గిరికి వెళ్లడమెందుకు? అసలు ఆయనకి తెలుసునో తెలీదో?

విశ్వామిత్రుడు.

తెలిస్తే మాత్రం ఏంచేస్తాడు? భార్య అతని పాఠాలు అతనికే వొప్పచెప్పి వ్యక్తి స్వాతంత్రమంటుంది.

గౌతముడు.

నీతిని గురించి, బృహస్పతి ఏం పిచ్చివాగుడు వాగినా యీ గృహిణి మాత్రం చాలా వివేకవంతురాలు, నిష్కల్మష చరిత్రా అనుకున్నాము.

(బృహస్పతీ, శశాంకుడూ వొచ్చారు)

బృహస్పతి.

యింతమంది ఒక్కసారిగా దయచేశారు? (కాళ్లు కడుక్కోడానికి అనూరాధ నీళ్లు తీసుకొచ్చింది) రాధా! వొదినతో శశాంకుడు వొచ్చాడని చెప్పు.

గౌతముడు.

యీ ఆపత్సమయంలో...

బృహస్ప

ఆపదా! ఆపద ఎవరికి?

దేవేంద్రుడు.

తమకు ఆ పుత్రులమని—

విశ్వామిత్రుడు.

తమ కుటుంబంలో అజరూప వ్యాఘ్రాలుచేరి జరిగించిన అక్రమవార్త మూడులోకాలూ వ్యాపించిపోయింది. తమకు ఏవిధంగానన్నా—

బృహస్పతి.

వార్తను పురస్కరించుకొని మీరందరూ యింతదూరం

నామీఁది వాత్సల్యంచేత భ్రమ అనక—

విశ్వామిత్రుఁడు.

సరేలేకాని యిది సాధారణ వ్యవహారమా ? అట్లా చెప్పరిస్తే ఆరేదీ తీరేదీకాదు...ఇంకా, వీఁడు, ఈ గురుద్రోహి, సుఖంగా, నీపక్కన...

బృహస్పతి

నా శిష్యులెవరూ గురుద్రోహులు కారు.

విశ్వామిత్రుఁడు.

ఇటువంటి అస్వాభవికమైన ప్రేమచేత నీ అసహాయత్వాన్ని కప్పజూస్తున్నావు. నీ సంసారం పునాది తవ్వే కూలతోనే కుచ్ఛితుఁడితోనా నీ కీస్నేహం? నీ తపస్సు నీ పురుషత్వాన్ని నాశనం చేసిందా ?

బృహస్పతి.

నాకు ఆపదకలిగినా నేను భరించలేనిదికాదు. ఇతరులు సహాయం చెయ్యవలసినదేమీ కనపడదు. మీ వాత్సల్యానికి ప్రణామాలు.

దేవేంద్రుఁడు.

(విచారంగా) ఆచార్యా, యీ వ్యవహారపు పర్యవసానం మీ ఆశ్రమంలోనే అంతమైతే మా అందరికీ జోక్యమెందుకు ? పవిత్రమైన మీ ఆశ్రమంలోనే యిట్లాంటి చర్యలు జరుగుతున్నాయంటే, తమ ఆశ్రితులం మా అందరికీ తలవొంపులుగా వుంది.

బృహస్పతి.

నామీఁది ప్రేమచేత వొచ్చారని పొరపడ్డాను.

విశ్వామిత్రుడు.

నువ్వు నిష్ప్రయోజకుడివై యిట్లాంటి దొంగపనులు యిల్లల్లో కళ్లుమూసుకుని, సహించి, వూరుకుంటున్నావని తెలుసుకొని, కారణం వూహించలేక, భార్యమీఁది మక్కువా, భయమా, అని యోచించి, నీ కళ్లు తెరవటానికి నీకు ధైర్య మివ్వడానికి, నీ పౌరుషం రేపటానికి, రుషులపేరు నిలబెట్టడానికి, యింకా భ్రష్టుడవై పోకండా అడ్డపెట్టడానికి వొచ్చాం తెలిసిందా !

బృహస్పతి

(నెమ్మదిగా) యిప్పుడేంచెయ్యమని తమ అనుజ్ఞ ?

విశ్వామిత్రుడు.

నీ ముందరే వున్నాయి ఉదాహరణాలు.

బృహస్పతి

గౌతముడి శాపంచేత యీ దేవేంద్రుడెంత పత్నీవ్రతుడైనాడు ?

విశ్వామిత్రుడు.

అహల్య పతివ్రత అయింది.

బృహస్పతి.

పాషాణి అయింది.

విశ్వామిత్రుడు.

దుర్మార్గులు వారి పాపకార్యాలు మాననీ, మానకపోనీ, మనం మన విధ్యుక్తకర్మ నెరవేర్చితీరాలి.

బృహస్పతి.

విధ్యుక్తకర్మ ఏమిటి? దండనా? శమదమన్వితుడివైన రుషివా దండధారివైన యముడివా?

దేవేంద్రుడు.

లోకోపకారార్థం, సంఘ పారిశుధ్యంకోసం తమరు శిక్షించితీరాలి.

బృహస్పతి.

శిక్షవల్ల లోకోపకారం ఎన్నడన్నా జరుగుతుందా? కాకులకు యీక కట్టినట్లు, లోకభయంకరార్థం, వీళ్లిద్దరి పీనుగుల్ని నా గుమ్మానికి వేళ్లాడకట్టనా! మీ కళ్ళకెవరు శిక్షార్హులో వాళ్లు నాకు ప్రేమపాశబంధితులు.

విశ్వామిత్రుడు.

చాలా విశ్వాసం కనపరిచారు నీపైన!

బృహస్పతి.

గౌతమరుషీ! నీ భార్యకి శాప మిచ్చేముందు, ఆమెకు తృప్తినీ, యితరపురుషుల్ని నిరాకరించే ధైర్యాన్నీ, యివ్వని నీ అవివేకాన్ని గురించి తలుచుకున్నావా?

గౌతముడు.

ఇట్లా నువ్వు వుపేక్ష చేస్తే లోకానికెంత వికృతంగా కన

పడుతోందో యోచించావా ?

బృహస్పతి.

లోకం యింకా మన బోటివాళ్లకు ప్రమాణమా ?

గౌతముడు.

భార్య బాధ్యత భర్తదికాదా ?

బృహస్పతి.

కాదు......పరజీవన సమస్యల బాధ్యతవహించ సాహసింపగలమా, అన్యానుభవగీతంలో మనపదాలు స్మృతి కలవక మాధుర్యాన్ని చెడగొట్టవా?

విశ్వామిత్రుడు.

ఇదిగో, బృహస్పతీ, సాధారణ సమయాల్లో, నీ యిష్టం వొచ్చినట్టు యీ సూత్రవాక్యాలను వుపన్యసించు. మన మందరం చర్చించడం, వాదించడం, వినోదంగానే వుంటుంది, కాని యిట్లా వ్యవహారం నెత్తిమీదికి వొచ్చినప్పుడు కూడా కులాసాగాకూచుని, నీ తర్కచాతుర్యంతో మా నోళ్లు కట్టాలనిచూడడం చాలా హాస్యాస్పదం. నీ విపరీతసిద్ధాంతాలు, తర్కానికే కాని జీవితంలో ప్రవేశపెడితే లోకం భగ్నమైపోదా ?

బృహస్పతి.

నావల్లనే భగ్నమౌతుందా లోకం? శాశ్వతుడైన పరమాత్మచే వ్యాప్తమైన యీ ప్రపంచం, నాదుర్బోధనల చేత భగ్నమౌతుందా? ఆ సత్యజ్యోతిలో నేనూ, నా

బోధనలూ తృణప్రాయంగా భస్మమై నశించక నిలవగలమా? ఏ మాత్రమూ భయము అనవసరము. లోకరక్షణా బాధ్యతను వహించే సర్వేశ్వరుడింకా సజీవుడై వున్నాడు.

గౌతముడు.

ఇంక నీతీ, దుర్నీతి విచక్షణ లేదూ?

బృహస్పతి.

ఇతరుల జీవితంలో నీతి, దుర్నీతుల్ని నిర్ణయించే న్యాయాధికార పీఠానికి నిన్నభిషక్తుణ్ణి చేసిందెవరు? ఆ విచక్షణ నీ జీవితాన్ని దిద్దుకునేందుకు వుపయోగపడాలి, లోకాన్ని దిద్దేందుకు కాదు.

గౌతముడు.

భార్యా, లోకమూ వొకటా?

బృహస్పతి.

నీ భార్య ఎవరు, నీవెవరు? ఇంకా మమకారం వొదలలేదా ఋషీ?

దేవేంద్రుడు.

తమకీ భేధ భావము లేదు. కాని ఆమెబోటి సామాన్యులకూ అజ్ఞానులకు కూడా అదే ధర్మమా?

బృహస్పతి.

సామాన్యులు వారికి తోచినట్లు ప్రవర్తిస్తారు. మనకెందుకు?

గౌతముడు.

ఆత్మాభివృద్ధి కోసం, ధర్మ బోధనకై —

బృహస్పతి.

(చాలా Emotion తో) గౌతమా, అజ్ఞానంతో, దుర్బలత్వంతో, మూర్ఖంతో, సమస్త రోగయాతిబాధలకూ లోనై, కర్మవశాన జరామరణాదులనించి విముక్తి గానక, అంధకారంలో మూర్గే యీ ప్రాణికోటికంతా, ధర్మబోధన చేస్తావా? గౌతమా, వారి ఆత్మాభివృద్ధి చెయ్యాలనే సంకల్పం వాస్తవంగా నీకుందా? వుంటే ప్రేమించు. సమస్తజీవుల్నీ ప్రేమించి, నీకన్న, నీ తపస్సుకన్న, నీ భార్యకన్న నీ యీశ్వరుడికన్న, అధికంగా దుర్గతిలో పెనుగులాడే యీ లోకాన్నంతా ప్రేమించు. కల్మష మంతటితోనూ యీ ప్రపంచాన్ని నీ హృదయాని కద్దుకో. పాపంలో మునిగినకొద్దీ, అంధకారంలో జారినకొద్దీ, నీ చేతుల్ని యింకా కిందికిజాచి, హృదయాని కింకా దగ్గిరిగా వొత్తుకో, ఖండించకు, శిక్షించకు—

గౌతముడు.

వారి కర్మానుసరణంగా జీవులు అనుభవిస్తారు. మనమేం చెయ్యగలం?

బృహస్పతి.

నిజం. యేమీ చెయ్యలేము. ఈశ్వరుడికే లేదు ఆశక్తి. నిస్సహాయులము. ప్రేమించగలం. అంతే!

గౌతముడు.

ప్రేమించి—ఏమిటి లాభం ?

బృహస్పతి.

వారి పారిశుధ్యంకోసం కాదు—నీ ఆత్మపారిశుధ్యం కోసమోయీ !

శిష్యుడు.

అమ్మగారు గురువుగారి నొకసారి దయచెయ్యమని విన్నవించమన్నారు.

(బృహస్పతి వెళ్లాడు.)

దేవేంద్రుడు.

ఇంక మనం చేసే దేముంది ?

విశ్వామిత్రుడు.

ఏముంది ? అంతభారమూ మన నెత్తిమీదనే వుంది. (శశాంకుడితో) యిదిగో మేము బృహస్పతులంకాదు. చూడు. నీవు చిన్నవాడివి, వృద్ధిలోకి రావలసిన వాడివి. ఏమిటీ నడత ? గురువు బోధనలువిని పెడతోవన పడ్డావంటే—

శశాంకుడు.

గురువుగారు దైవజ్ఞులు. ఆయనేమీ బోధించరు. ఆయన నేత్రాల్లోని శాంతం చాలు మావంటివారి అవివేకాన్ని వెలిగించేందుకు...

(తార వొచ్చింది.)

బతిమాలి సిగ్గుపడడం అదోవిధం.

విశ్వామిత్రుడు.

ఈశశాంకుడికి పెళ్లిచేస్తే! గౌతమా, నువ్వే చెయ్యాలి ఆపని. ఒరేయి(శిష్యుడువొచ్చాడు) మేమువెడుతున్నాము. మీగురువుగారిని రమ్మను. (శిష్యుడు వెళ్లాడు)

గౌతముడు.

నేనేంచెయ్యను? వాణ్ణిసంసారినిచేస్తేమాత్రం యీసంబంధం తప్పుతుందని నిర్ధారణ ఏమిటి?

విశ్వామిత్రుడు.

ప్రస్తుతం యీప్రశయంతప్పితే తరువాత చూసుకోవచ్చు. యథావిధిగా సంసారాలుంటే, యిట్లా సంగతులు బైటికి రావు. సరేరండి, ఆలోచిద్దాము. అబ్బాప్రాణంమీదికి వొచ్చిపడింది సమస్య. (బృహస్పతి వొచ్చాడు) నీసత్కారానికి చాలా సంతోషం. వెడతామింక.

బృహస్పతి.

చిత్తం.

విశ్వామిత్రుడు.

మేముచెప్పవలిసింది చెప్పాము నీయిష్టం. వృథాగా అధోగతిపాలవుతావు. మమ్మల్ని అప్రతిష్టపాలుచేస్తావు.

బృహస్పతి.

అంతశక్తివంతుణ్ణా నేను!

# అంకం ౫

(ఆరోజే రాత్రి పదిగంటలు నిండువెన్నెల. ఆశ్రమం వెనక అడవి. ముందు పెద్ద మర్రి, టేకు, బాడిదచెట్లు గుబురుగా, చీకటిగా ఉన్నాయి, వెనక యిసికా, దానివెనక సన్నని నీలపు కాలవా వున్నాయి. చెట్లనిండా మిణుగురుపురుగులు. కిందికి వొంగిన జీడి మామిడిచెట్టు కొమ్మమీద శశాంకుడు కూచుని వున్నాడు. మీద వెన్నెలపడుతోంది. వొంటినిండా గంధం, మెళ్లో బొడ్డు మల్లెలదండ. అతనిపక్కన కొమ్మనానుకుని తార నుంచునివుంది.)

తార.

నేను యెంతో భయపడ్డాను ముందు. చివరికి గురువుగారి దేవతాతీతమైనకారుణ్యంకూడా యీ విషయంలో భంగపడుతుం దేమోనని! ఆయనకే ఆగ్రహం కలిగి వుండినా తలుచుకోలేను ఏమయ్యేదో! ...... ఈ వున్మత్తావేశాన్ని చూసి నేనే భయపడతాను. ఈ భీకర ప్రణయం పాపమని ద్రోహమని నన్ను దండించి నిరంతర నరకజ్వాలలో కాలమని శపించినా నేను వ్యసనపడను. ఒక్కసారి నా జీవితాన్ని సంపూర్ణంగా సఫలీకృతం చేసుకున్నాననే సంతుష్టి నన్ను వొదలదు. కాని నీకే కించిదపాయం కలిగినా నేను భరించలేను. నాదారుణవాంఛ మూలంగా నువ్వు నా శశివి, నా పాపవు, గాయపడ్డావనే బాధ నన్ను కాల్చి భస్మంచేస్తుంది. నువ్వు వొచ్చిందాకా అక్కడేం జరిగిందోఅనే భయపడుతున్నాను. ఏమన్నారు, శశీ?

శశాంకుడు.

ఏమీలేదు. వెనకాలె వొచ్చి బుజంమీద చెయ్యేసి "శశీ, యిట్లా వొచ్చావేం! నువ్వెక్కడికి వెళ్లావోనని మీ అమ్మ అల్లలాడుతోంది," అనగానే యీ జన్మంలో మళ్లీ యీ ఆశ్రమం చూడనని దృఢనిశ్చయం చేసుకున్న నేను మేకపిల్లలాగు వెంట నడిచివొచ్చాను. తోవపొడుగునా అనేకవిషయాలుచెప్పి నవ్విస్తోనే వున్నారు నన్ను.

(తార ఆలోచిస్తోంది.)

తార.

యిప్పుడు తలుచుకుంటే నిన్నరాత్రైనా ఆ తీవ్రకామేచ్ఛతో నీ కెందుకు తాత్కాలిక విరక్తినైనా కలిగించానా అని సిగ్గవుతోంది. యే దేశమో పోయి, యెదిగి వొచ్చిన కుమారుణ్ణి కావిలించుకున్నట్టుంది నాకీరాత్రి.

(బృహస్పతి వొచ్చాడు. ప్రేమతో చెరొక చేత్తో చెట్టుమీద శశాంకుణ్ణి నుంచున్న తారనీ కావిలించుకున్నాడు.)

బృహస్పతి.

ఇక్కడే వుంటారనుకున్నాను. ఈస్థలంలో యెప్పుడూ ప్రపంచవిశాలత్వం గోచరిస్తుంది. ఇక్కడ రాత్రులు మౌనముద్రలో కూచుంటే క్రమంగా ఆత్మ యీ వెన్నెలలో తేలి యీ చెట్లను, ఆకాలవను, ఆదూరపు పర్వతాలనూ అతిక్రమించి, అక్రమించి యీసృష్టితో ఐక్యమైనట్టుండేది ఇదంతా 'నాదే' అనే భావంనించి యిదంతా 'నేనే' అనే

భావంలోకి ఆత్మవికసించేది. అదంతా యోగసాధని ప్రారంభ దశ. ఎన్నేళ్ళయిందో. ఇంకా తారాదేవి తన మృదుత్వంతో ఆశ్రమానికి నాగరీకతను ప్రసాదించక పూర్వం. తారా! అన్నట్టు అహల్యాదేవి వొచ్చింది.

తార.

అహల్యాదేవి!

బృహస్ప

ఆమెనీ మన ఆశ్రమసౌందర్యమే ఆహ్వానించిందట ఈరాత్రి. అకస్మాత్తుగా మన ఆశ్రమం యింత ఆకర్షజనక మయింది. (కులాసాగా నవ్వుతున్నాడు.)

2000-Oct. 37. The Jupiter Press, 16, Sembudoss St., Madras.

అర్జు—

ఉ. అచ్చపుఁబ్రేమఁ గాచెదవు మాంతరంగుఁ డీతనికేఁడు లేరు బల్
హెచ్చుగఁ గీర్తిఁ దేవు మము మా హేంద్రసమానులఁ జేయ వేడ్క
వచ్చినవాఁడవు, కేవలఁ బా వాంతరసంతతము లుండఁబో వికన్
గుర్చిత్తులైన శాత్రవులు కూలక మానరు చింతమానుమా.

భీము—నిన్నకనకన్య మాటిన కర్ణుఁడు బీభత్సునిచేతను, కుంభజుఁడు ధృష్టద్యుమ్నునిచేతను, నిన్నుఁ బరిభవించిన దుర్యోధన దుశ్శాసనులు నాచేతను మడిసెదరు. పాంచాలరాజతనయా! భీమ న ప్రతాపాగ్నికి శ్రీకృష్ణ ప్రసాదానిలము తోడ్పడిన నీపరిభవ ధ్వాంధకార మంతమొందుట కేమిసందేహము.

ధర్మ—కర్ణుని గదచను దలచుకొన్నఁ గంట నిదురరాకున్నది. విశారదులగు భీష్మ ద్రోణ కృపులఁ దలతునేని గుండె ఝల్లు మన్నది. శత్రుసంహార మెట్లు కాఁగలదు?

[వ్యాసుఁడు ప్రవేశము.]

వ్యాసు—

కీర్తన

1. కృష్ణ! పాహిమాం - రాధాకృష్ణ పాహిమాం॥
2. ద్వారావతీశా - ధర్మార్థసంభవా।
దానవాంతకా - కృష్ణా! దాసపోషకా।
నాభురక్షకా - రాధాకృష్ణ పాహిమాం ॥కృష్ణ॥
శ్రీకృష్ణభగవానులా!

కృష్ణ—మునిపుంగవులకు స్వాగతము. (అందఱు నమస్కరింతురు

వ్యాసు—యుధిష్ఠిర! సౌభాగ్యగణ్యుఁడగు కర్ణుని బరాక్రమ భీష్మ ద్రోణ కృపుల శస్త్రాస్త్రసిద్ధి, భూరిశ్రవాది మహారథుల ధనైపుణ్యము, నీకు వ్యాకులము గలిగించుచున్నవి. దివ్యాస్త్రం బడసినఁగాని మీకు జయముగలుగనేరదు. అస్త్రసిద్ధికిసాటి క